ఫార్వర్డ్ బ్లాక్

Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారపత్రిక

సంపుటం 2 | బుధవారం 10-5-39 బెజవాడ | సంచిక 21



కామ్రేడ్ చంద్రసింగ్.



కామ్రేడ్స్ జయదేవకపూర్, గయాప్రసాద్ సింగం, శివవర్మ, రామసింగ్.

వీరిలో మొదటి ముగ్గురు 1930 లాహోరు కుట్రకేసులో యావజ్జీవ శిక్ష విధించబడ్డారు. లాహోరు, ముల్తాను, రాజమండ్రి, బళ్లారి, వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. అనేకసార్లు నిరశన వ్రతం చేశారు. మద్రాసు జైళ్ళలో 5 నెలలు ఒకసారి నిరశనవ్రతం చేశారు. ఇదే పెద్దది. 1933 లో అండమానులలో చారిత్ర్యాత్మకమగు నిరశనవ్రతం సాగించారు. ప్రజాందోళనవలన వీరిని తిరిగి దేశానికి తీసుక వచ్చి పంజాబు జైళ్ళలో నుంచారు. ఇంకా విడుదల కాలేదు.

కామ్రేడ్ రామసింగ్. అజ్మీర్ షూటింగు కేసులో 7 ఏండ్లు శిక్షింపబడి అండమానులకు పంపబడ్డాడు. '37 లో నిరశనవ్రతంలో పాల్గొన్నాడు. మళ్ళా ఇండియాకు తీసుక వచ్చాక లక్నో (కాంగ్రెస్) జైలులో నున్నాడు.

★

కామ్రేడ్ చంద్రసింగ్ (హవల్దార్) 1930 లో ప్రజలపై కాల్చడానికి తిరస్కరించాడు. కోర్టుమార్షల్ చేసి, కాల్చి చంపమని ప్రభుత్వం శిక్ష విధించింది.

కాని, తర్వాత యావజ్జీవ శిక్షగా మార్చింది. గాంధి ఇర్విన్ సంధిలోగాని, ఇతరత్రాగాని ఇతని విడుదలకు ప్రయత్నం జరగలేదు. గర్వాల్ రెజిమెంటు ఖైదీలు విడుదలపడ్డా ఇతని విడుదల కాలేదు.



24 పేజీలు ★★★ అణా

### పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సర్క్యులర్.

ఏలూరులో జరిగిన జిల్లా కాం. సో. పార్టీ కాన్ఫరెన్సు తీర్మానప్రకారం ప్రతిపార్టీ సభ్యుడు ప్రతినెలా 0-8-0 లు వంతున కోటా జిల్లా పార్టీకి యివ్వాలని తీర్మానించ బడినది. దాని ప్రకారం రెండుసార్లు తాలూకాపార్టీలకు సర్క్యులర్లుపంపించియున్నాము. ఏతాలూకానుండి ఏమాత్రమున్నూ వచ్చియుండలేదు. రాష్ట్రపార్టీకూడా మొన్న బెజవాడ ప్రతినిధుల సమావేశములో [illegible] సభ్యుడూ ప్రతినెలా ఒక అణా [illegible] పార్టీకి పంపించవలసి యుంచు [illegible] నిశ్చయ [illegible] వంతున ప్రతినెలా పస్తే రాష్ట్రపార్టీ కోటా 0-1-0 కూడా దానిలోనుండే పంపవచ్చును. యిప్పటికి మూడు మాసముల నుండి రావలసిన కోటాలను వసూలుచేసి పంప వలెను. మిగిలిన నిర్మాణ కార్యక్రమాన్ని గురించిన వివరాలు "రాష్ట్రపార్టీ దెలిగేట్ల సమావేశపు తీర్మానాలు" కరపత్రం చూడ కోరిక.

ఇట్లు

గా॥ సత్యనారాయణ

కార్యదర్శి

* * *

చిత్తూరుజిల్లా సోషలిస్టుపార్టీ సమావేశము కామ్రేడ్ [illegible] రామనాథం అధ్యక్షతక్రింద జరిగినది.

S. [illegible] ప్ర. కార్యదర్శి
S. పద్మనాభరావు సం. కార్యదర్శి
ఆర్. యమ్. రత్నం ఆర్గనైజర్

కార్య నిర్వాహక వర్గం

1. L. [illegible] రాజయ్యంగార్
2. D. [illegible]
3. [illegible]
4. R [illegible] రెడ్డి
5. D [illegible] రావు
6. P [illegible]
7. S [illegible]

* * *

### భీమవరం తాలూకా కాం॥ సో॥ పార్టీ.

20-4- న తాలూకా పార్టీ సాగి బుచ్చి రామరాజుగారి అధ్యక్షతను సమావేశముయినది.

1. కార్యదర్శి రిపోర్టు అంగీకరించడ మైనది.

2. పార్టీ కార్యదర్శిగా సంకు అప్పారావు గారిని తిరిగి ఎన్నుకోబడమైనది.

3. నవశక్తి చందాయిన్నూ, ప్రతి పార్టీ సభ్యుడు 0-8-0 యిన్నూ, యిప్పటిలె సనేడి జిల్లా మహాసభ తీర్మానమును అమలు జరుపవలెను. ప్రతి పదిహేను రోజులకు ప్రతి పార్టీ సభ్యుడు రిపోర్టును పంపవలెను లేనిచో పార్టీ నుండి తొలగించబడును.

* * *

### పిఠాపురం తాలూకా కాం॥ సో॥ పార్టీ.

పిఠాపురం తాలూకా కాంగ్రెసు సోషలిస్టు పార్టీవారు ఆ తాలూకాలో కాకినాడ పీచుకూలీల సమ్మె నిధికి 50 రూపాయలు వసూలుచేసిరి. అందులో 31 రూపాయలు వసూలై సమ్మె నిధికి పంపబడెను. మిగిలిన 19 రూపాయలు [illegible] రోజుల తరవాత పంపబడెను.

[illegible] 39 న తాలూకాపార్టీ సమావేశమై కాకినాడ పీచుపనివాండ్ల సమ్మెకు సానుభూతి తెలుపుతూ తీర్మానించిరి.

## గమనించండి

* * *

భీమవరం తాలూకా కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము 4-5-39 ని జక్కారం గ్రామంలో వేగేశ్న సత్యనారాయణరాజుగారి అధ్యక్షతను సమావేశమై గావించిన తీర్మానములు :

1. నూతన సంవత్సర ఆదాయ వ్యయ పట్టిక ఆమోదించిరి.

2. కార్యదర్శి ప్రచారక రిపోర్టు ఆమోదించిరి.

3. తాలూకాలో గల పంచాయితీలు, బ్యాంకులు మొదలగు ప్రజాసంస్థల గూర్చి వ్యవహరించుటకు ముగ్గురితో గూడిన కమిటీని నియమించడమైనది దంతులూరి రామరాజు, వేగేశ్న పెద సుబ్బరాజు. కృ॥ వెంకటేశ్వరరావుగార్లు.

4. తాలూకాలోని రైతు కూలీలకు సంబంధించిన పనులు చూచుటకు సంకు అప్పారావు, సాగి నారాయణరాజు, గొట్టుముక్కల రామచంద్రరాజుగార్లతో గూడిన కమిటీని. నియమించిరి.

5. గ్రామ కాంగ్రెసు సంఘములను సరిగా పనిచేయులాగున తరిఫీదుచేయుటకు ఆర్గనైజరుగా సంకు అప్పారావుగారిని నియమించిరి.

6. కార్యనిర్వాహకవర్గ సభ్యులు మీటింగుకు వచ్చునప్పుడు గాంధి టోపీలు ధరించుటకును, తాలూకా కాంగ్రెసు సభ్యులు మీటింగుకు హాజరగునప్పుడు తప్పక గాంధి టోపీని ధరించవలసినదిగాను హెచ్చరించిరి.

7. తాలూకాలో ప్రచారముచేయు వాలంటీర్ల కొరకు 6 రికి లాగులు, చొక్కాలు, టోపీలు తాలూకా సంఘ నిధినుంచి వ్యయపరచి కుట్టించుటకును తీర్మానించడమైనది.

8. అంచ గొండితనమును గూర్చి కొత్తపల్లి సుబ్బరాజుగారు, గొట్టుముక్కల అప్పలరాజుగారు, పెన్మెత్స సత్యనారాయణ రాజుగారు, యాళ్లబండి పోలిసెట్టిగారు, మంతెన కృష్ణంరాజుగార్లతో కూడిన ఒక కమిటీ కన్వీనరుగారు కార్యదర్శి కృ॥ వెంకటేశ్వరరావుగార్ని నియమించడమైనది.

కృ॥ వెంకటేశ్వరరావు,

కార్యదర్శి,

* * *

### ఉత్తర విశాఖజిల్లా బస్సుపనివారల సంఘం.

ఉత్తర విశాఖజిల్లాలోని వివిధ బస్సుల డ్రయివర్లు, కండక్టర్లు యితర పనివారలందరు 30-4-39 తేదీ ఉదయం 7 గంటలకు జిల్లా కాంగ్రెసు ఆఫీసులో శ్రీ కరుణాకరం సుబ్బారావు, యం. ఎల్. ఏ, గారి అధ్యక్షతను సమావేశమై యీ దిగువ తీర్మానములను ఆమోదించిరి:

1. ఈ సంఘమునకు శ్రీ కరుణాకరం సుబ్బారావు, యం. యల్. ఏ., గారు అధ్యక్షులు, శ్రీ గరిమెళ్ల వెంకటరమణమూర్తిగారు కార్యదర్శి.

1. శ్రీ వడిమింట చింతామణి శాస్త్రిగారు
2. శ్రీ కె అప్పారావు
3. శ్రీ కె. రామమూర్తినాయుడు
4. శ్రీ బి. సీతాపతి
5. పి. సుబ్బారావు

గార్లు కార్యనిర్వాహకవర్గముగా ఎన్నుకొనిరి.

2. ఈ సంఘమునకు సంబంధించిన నిబంధనలు, షరతులు యావత్తు ఫోగట్టా 15 దినములలో ఏర్పరచి, సంఘముయొక్క ఆమోదమునకు తెచ్చుటకు నిశ్చయించడమైనది.

కె. సుబ్బారావు,

అధ్యక్షుడు.

* * *

### సఖినేటిపల్లి

25-4-39 తేదీని సఖినేటిపల్లి వ్యవసాయ కూలీసంఘం సమావేశమై, కాకినాడ సమ్మెదారులపట్ల సానుభూతిని తెలుపుతూ కార్మికులను కార్మిక నాయకులను అరెస్టు చేసినందుకు ప్రభుత్వచర్యపట్ల అసమ్మతిని తెలుపుచు, శిక్షల పొందినవారిని, విచారణలో నున్నవారిని ఏ షరతులు లేకుండా విడుదల చేయవలసినదిగా ప్రభుత్వమును కోరుతూ, వెంటనే కార్మికుల హక్కులను భద్రపరచే కార్మిక శాసనము గావించ వలసినదిగా ప్రభుత్వమును కోరుతూ తీర్మానములు గావించిరి.

* * *

### యువజన సంఘము కొల్లూరు.

పైసంఘము మే 2వ తేదీని సమావేశమైంది. కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ B. A. (Hons) B. L. గారధ్యక్షత వహించిరి. శ్రీ కల్లూరి చంద్రమౌళి M. L. A. గారు ప్రారంభోత్సవము జరిపిరి. ఉదయం 60 మంది యువకులు, జాతీయ పతాకాలతోనూ, ఎఱ్ఱజెండాలతోనూ, బ్యాండుతోనూ ఊరేగింపు జరిపిరి, అధ్యక్షులుకూడా ఊరేగింపులో పాల్గొనిరి. పిదప యువకులందరు హాస్టలులో సమావేశమైరి. యువకులయొక్క విధి, స్వాతంత్ర్య పోరాటంలో వారియొక్క పాత్రనుగూర్చి అధ్యక్షులు ఉపన్యసించిరి. సాయంత్రంకూడ ఊరేగింపు మహోత్సవము జరిపిరి. తరువాత హాస్టలులో బహిరంగసభ జరిగినది. అనేకమంది రైతులుగూడా సభ కరుదెంచిరి. సభలో చంద్రమౌళిగారు యం. వెంకటరాజుగారు మాట్లాడిరి. కామ్రేడ్ సత్యనారాయణగారు ప్రపంచ పరిస్థితులను విపులపరచిరి. ఏ యువకుడునూ రానున్న సామ్రాజ్యవాద యుద్ధాలకు ఆహుతిగా రాదనియు, ఈ అవకాశాన్ని పూర్తిగా పురస్కరించుకొని స్వరాజ్యానికి యువకులు పనిచేయవలయునదియూ చెప్పుచూ ఉపన్యసించిరి. తరువాత సమావేశ కర్త కామ్రేడ్ పి. మల్లయ్యగారు మాట్లాడుచు సంఘోద్దేశ్యాల్ని విపులీకరించి చెప్పిన తరువాత వందనముతో సభ ముగిసెను.

* * *

### చిత్తూరుజిల్లా కాంగ్రెసు ఎన్నికలు.

28 ఏప్రియల్ చిత్తూరుజిల్లా కాంగ్రెసు ఆఫీసులో జరిగినవి.

సుర్. సుందరరాజయ్యంగారు, అధ్యక్షులు
డి. మునిరత్నం నాయుడు, ప్ర॥ కార్యదర్శి
డి. ఆర్. కృష్ణన్, } సహ॥కార్యదర్శులు
కె. వెంకటరాఘవరెడ్డి }

కార్యనిర్వాహక సభ్యులు :

1. ఆసం కన్నయ్య
2. హెచ్. యన్. సింహం
3. డి. రామబ్రహ్మంహం
4. ఆర్. యం. రత్నం
5. ఆర్. నాధమురెడ్డి
6. వి. టి. జగన్నాధరావు
7. సుందర వరదులు
8. కందేరి మునుస్వామినాయుడు
9. గోవిందురెడ్డి
10. కె. శ్రీనివాసులు శెట్టి
11. గుర్రం వెంకటప్ప

* * *

### యుద్ధాన్ని ఎదిరించి. స్వరాజ్యం సంపాదించడానికి సిద్ధంగా వుండండి! ఆంధ్రదేశములో "మే" దినోత్సవ నినాదం.

ఆంధ్రదేశమందు చాల ప్రాంతాలలో మే వ తేదీని మే దినోత్సవం జయప్రదంగా జరిగింది. ప్రపంచయుద్ధం సంభవించే టట్లయితే. దానిని ఎదిరించి భారత స్వాతంత్ర్య పోరాటమును జయప్రదంగా సాగించుటకు సిద్ధముగా ఉండవలసినదని పలువురు ప్రముఖులు ప్రజలను హెచ్చరించారు. ఈమహోత్సవము మద్రాసు, నెల్లూరు, యిందుపూరు, కోలవెన్ను బెజవాడ, కానూరు అగ్రహారం, అమ్మిగుంట, యేలూరుపాడు, రాజమండ్రి, సామర్లకోట, విశాఖపట్టణం, ఇచ్ఛాపురం, మొదలగు వాటిలో జరుపబడింది.

* * *

### యుద్ధ ప్రతికూల సభలు

అఖిలభారత కాంగ్రెసు మహాసభాధ్యక్షుడు సుభాస్‌బోస్ ఆదేశానుసారం 23-4-39 తేదీని ఆంధ్రదేశములో చాలా ప్రాంతాలలో సభలు జరుపబడినవి. ప్రపంచ యుద్ధమును ఎదిరించి, మనం స్వరాజ్యం సంపాదించుటకు పూనుకోవాలి, అనే ప్రబోధం తీవ్రంగా సాగించబడినది.

* * *

### బందరుతాలూకా రైతుసంఘం, చెన్నూరు.

బందరుతాలూకా రైతు సంఘ సాధారణ సభ్యుల సమావేశము ది 13-5-39 తేదీ పగలు $7\frac{1}{2}$ గంటలకు చెన్నూరుగ్రామములోని గ్రంథాలయ భవనములో జరుపబడును గాన సభ్యులెల్లరు దయచేయ ప్రార్థితులు.

కార్యక్రమము.

1. సంఘముయొక్క నూతన కార్యనిర్వాహక వర్గ ఎన్నికలు.
2. జమాఖర్చులు ఆమోదించుట.
3. తదితర విషయములు.

యర్రంశెట్టి కృష్ణమూర్తి,

అధ్యక్షుడు.

షరా:-భోజనవసతి ఏర్పాటు చేయడమయినది.

### కామ్రేడ్ గోవిందమ్మ నిర్యాణం

నెల్లూరు జిల్లాలోని అలగానిపాడు గ్రామ నివాసిన్యైన పి. గోవిందమ్మగారు 3 సం॥ నుండి నెల్లూరుజిల్లా కాం॥ సో॥ పార్టీలో సభ్యురాలుగా నుండి బ్రిటిషు సామ్రాజ్యాధికారమునుండి మన దేశమునకు విముక్తి కలుగుటకును సోషలిస్టు రాజ్యాంగమును మన దేశములో స్థాపన చేయుటకును జరుగు ప్రతి వుద్యమునకు అనేక విధముల తోడ్పడుటయేగాక స్వయముగా కృషి చేయుచుండిరి. ఆమె 30-4-39 తేదీ మధ్యాహ్నం 12—30 ఘంటలకు టైఫాయిడ్ జ్వరము వలన చిఱుత వయస్సునందే మద్రాసులో జనరల్ హాస్పెటలునందు మరణించి నందులకు పూర్తి విచారమును తెలియజేయుచున్నాను.

బి. శంకరయ్య

కార్యదర్శి

నెల్లూరుజిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ

7—5—39.

సంపుటం 2 సంచిక 21

# నవశక్తి

బుధవారం 10-5-39

సంపాదకవర్గం: మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు). కంభంపాటి సత్యనారాయణ. పుచ్చలపల్లి సుందరయ్య. తుమ్మల వెంకట రామయ్య.

## అతివాదుల కర్తవ్యం

కలకత్తా కాంగ్రెస్ కథ ముగిసింది. ప్రజాస్వామ్య పద్ధతిని ఎన్నుకోబడిన అధ్యక్షుడు రాజీనామా ఈయవలసి వచ్చింది. "పట్టాభి ఓటమి నా ఓటమి" అని హృదయావేదన మహాత్ముడు వెల్లడించినపుడు "హిందూదేశములో కెల్ల మహాపురుషుని" సహకారం రాదేమోనని బోసు భయపడినపుడు, స్వాతంత్ర్య పోరాటాన్ని అభిలషించుతూ బోసుకు ఓటుచేసిన కాంగ్రెస్ సభ్యులే భయపడ్డారు. కాంగ్రెస్ అనుచరులలోని భీతి పెద్దలకు తెలుసు. తమ పలుకుబడి తెలుసు. తమ పలుకుబడినంతా ఉపయోగించి, త్రిపురీకాంగ్రెస్‌లో అతి ప్రధానమైన సమస్యలను పెడకుత్రోసి, 'బోసు మోపిన నిందల (?) గురించి మహాభారత యుద్ధం గావించారు; దాని ఫలితం పంతు తీర్మానం.

బోసు పథానికి అడ్డురాని పెద్దలు బోసు కాలుచేతులు కట్టివైచారు. దురదృష్టవశాత్తు బోసు అనారోగ్య పరిస్థితులవల్లనేమి, మరి ఇతర కారణాలవల్ల నేమి ఈ నాల్గునెలలు దేశాన్ని నడపగల కార్యనిర్వాహకవర్గము లేకపోయిసద.

కలకత్తా సమావేశము వచ్చినది, పంతుతీర్మానము ప్రకారము మహాత్ముడు పేర్లు సూచించాలి. సుభాషబాబుతో ఏకీభవించి సూచించకపోతే తానే సూచించాలి. కాని అలా చేయలేదు. పోనీ, కాంగ్రెస్ అధ్యక్షుడు సూచించిన పేర్లకు అనుమతి నీయలేదు. పూర్వపు వర్కింగు కమిటీనంతయు వైచి, "ఇది మహాత్ముని అభీష్టం" అని చెప్పడానికికూడా అనుమతి నీయలేదు. పంతుతీర్మానాన్ని ధిక్కరించుతాడని, సుభాసుబాబుపై వదంతులు ప్రాకినయి. కాని నేడు పంతుతీర్మానాన్ని ధిక్కరించినది, సుభాసుబాబుకాదు. ఎవని అభీష్టాన్ని అనుసరించాలో, ఎవరిని ధిక్కరించారని కాంగ్రెస్ పెద్దలు చెబుతున్నారో. ఎవరు "పట్టాభి ఓటమి తన ఓటమి"గా తీసుకొన్నారో, ఆ మహాత్ముడే. బోసు నెహ్రూల ప్రయత్నాలుగాని, చివరకు మౌలానా సూచించిన విధానముకాని వారికి నచ్చలేదు. "సుభాసు రాజీనామానిచ్చి తీరాలి" ఇది సఫలించింది. దేశాన్ని కలవరపెట్టుతున్న సమస్య "పరిష్కారమైంది" గాంధిమహాత్ముని దివ్యమంగళ విగ్రహారాధనలో సుషుప్తమైన ఒక ఆత్మకూడ జాగృతమై "మహాత్ముడు ఒకింత కఠినముగ సంచరించెనని చెప్పసాహసించున్నాము" (ఆంధ్రపత్రిక) అని పలుక వలసి వచ్చినది.

రాజకోట సమస్య పరిష్కరించుటలో మహాత్ముడు "నేను ముదుసలినయ్యాను నాయౌవ్వనమంతయు కోల్పోయితిని" అని అన్నాడు. అక్కడ ఎదుర్కొన వలసి వచ్చినది పటేలు వాక్యములలో "క్రూర ఆయుధాలనుధరించి హిందూదేశము నంతటనుండీ వచ్చిన కాంగ్రెస్ వ్యతిరేకశక్తులు," ఇక్కడో సుభాసుబాబు. మహాత్ముని ధిక్కరించిన సుభాసుబాబు, అత్యధిక కాంగ్రెసు సభ్యులచే ప్రజాస్వామ్యపద్ధతిని ఎన్నుకోబడ్డ సుభాసుబాబు, సుభాసుచే రాజీనామానిప్పించుటలో "పట్టాభికి జయము" కల్గకపోయినా "మహాత్మునికి జయము" కల్గినది. రాజకోటలో, రియాక్షనరీశక్తులను, సామ్రాజ్యవాద కుతంత్రాలను ఎదుర్కొనుటలో కోల్పోయిన యౌవ్వనాన్ని, తోటి కాంగ్రెస్ యోధుని జయించుటలోమహాత్ముడు మరల కోలుకొని యుండవచ్చు.మహాత్ముని యౌవనము రస్థాయి యగుగాక! మహాత్ముని విజయాలు చిరస్థాయి యగుగాక!;

ఇది కాంగ్రెస్ వినాశనానికి, దేశ వినాశనానికి త్రోవ! "ఒకే రకపు" భావాలుగల వర్కింగుకమిటీ నేడు ఏర్పడింది. నేడు దేశానికి కావలసింది సంయుక్త నాయకత్వం' గాని ఒకే రకపు భావాలుగల నాయకత్వం కాదు. బృందావన ఉపన్యాసంలో పటేలు "దేశంలో అనైకమత్యం, తగాదాలు హానికరం. అందుకనే మహాత్ముడు, గవర్నమెంటును పోరాడగల్గిన ఒకే ఒక సంఘమగు కాంగ్రెసు ఆచరణలోను, భావంలోను ఒకే రకంగా ఉండాలని అంటున్నాడు. ఏ పార్టీ అధికారంలో ఉన్నా అది లెఖ్కలోనిది కాదు. ఒక పార్టీ బాధ్యత వహించలేనపుడు మరొకపార్టీ వహించాలి; అందుకే ఈ భారం మేము వహించాలి."

ఐకమత్యం కావాలి అంటే ఒక భాగాన్ని తుడిచివేస్తే వచ్చేది ఐకమత్యమా? నేడు కాంగ్రెసు పెద్దలకన్నా అతివాదులే ఐకమత్యావశ్యకతను ఎక్కువ కోరుచున్నారు. ఒక పార్టీ బాధ్యత వహించలేదని ఎవరూ చెప్పలేదు. బాధ్యత వహించడానికి వీలు లేకుండా పెద్దలు చేశారు. ఇంతేగాదు బాధ్యతవహించవలసింది 'అన్ని పక్షులుగలసిన' నాయకత్వం గాని. 'ఒక్క' పార్టీయేగాదు. ఇంతేగాని, ఇల్లు చక్కబెట్టడానికని అతివాదులను 'శుద్ధి'చేసి, ఒకే రకపు "భావాలు, ఆచరణ" కలిగేటట్లు చేయడం కాదు.

మితవాదుల ఈ మొండిపట్టు, విప్లవ పంథాను నడచుచున్న కాంగ్రెస్ అనుచరులలో గందరగోళం కల్గించుచున్నది. "ప్రస్తుత నాయకత్వం" తీసివేసి, "మరో క్రొత్త నాయకత్వం" కావాలనే వాదన బయలుదేరనిచ్చింది.

నేడు దేశానికి కావాలసింది. బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని దెబ్బగొట్టగల "సంయుక్త నాయకత్వం." ఇందులో ఏ భాగం పోయినా పోరాటానికి తీరనిదెబ్బ. "విప్లవ నాయకత్వం కావాలి! కావాలి!! "అని గొంతు చించుకొంటే రాదు. పోరాటంలో, పోరాటంద్వారా, 'విప్లవ నాయకత్వం' వస్తుంది. అందుకు నేడున్న కాంగ్రెస్ యంత్రాన్ని పోరాటానికి కదలించాలి. జాతీయ వాంఛా తీర్మానం, యుద్ధ వ్యతిరేక తీర్మానం మొదలైనవే చాలు నేడు పోరాటానికి. కాని వీటిని ఆచరణలో పెట్టించాలి. ఆచరణలో పెట్టించితేనే నేడు కాంగ్రెస్‌లో ఆవహించిన 'డ్రిఫ్టు' విధానం పోతేనే పోరాటం వస్తుంది. ఇది పోవాలంటే మొదట మితవాదులపై కత్తికట్టి, వారిని కూలద్రోయటం కాదు. ఈ తీర్మానాలు దేశ మంతటా విరివిగా ప్రచారం గావించి, వారిపై ఒత్తిడి తెచ్చి, వారిని పోరాటంలోకి తీసుకు రావాలి. కాని వారి శక్తి "ఖర్చు"యిపోయిందనీ, వారి స్థానే మరో విప్లవ నాయకత్వం ఎక్కడ నుండో లాక్కొని వచ్చి స్థాపించుదామనీ, రాయ్ మొదలగు వారుచేసే ప్రచారమూ హానికరమే. "ఒకే భావాలుగల" నాయకత్వం మితవాదులు కావాలనడం ఎంత హానికరమో, ప్రాతనాయకత్వాన్ని ఊడగొట్టి మరో నాయకత్వాన్ని ఈ నాడు స్థాపించుదామని" అనుకోడం కూడా అంతే హానికరం.

నేడు దేశానికి కావాలసింది మొదటినుండీ చెప్పుతున్నట్లుసంయుక్త నాయకత్వము. ఇదే సుభాసు కోరాడు. కోరుతున్నాడు.

అతివాదులను శుద్ధిచేసి. ఇల్లు చక్కపెట్టి. గాంధి సేనాసంఘసభ్యులు "మనం మనయంత్రాన్ని సరియైన భావనలోను. విధానంలోను పెట్టి, నడిపితే పోరాటము లేకుండానే అధికారాన్ని స్వీకరింపవచ్చు" (పటేలు బృందావన ఉపన్యాసం) అని తలిస్తే ఇంతకంటె దేశానికి హాని మరొకటి ఉండదు.

ఈ వైఖరిని మాన్పించాలంటే అది అతివాదుల చేతిలోనే ఉన్నది. కాంగ్రెస్ సాధారణ సభ్యుల చేతులలోనే ఉన్నది. కలకత్తాలో జవహర్‌లాల్ గావించిన హెచ్చరిక మఱచిపోరాదు. "పైనుండు నాయకులను గ్రుడ్డిగా అనుసరించరాదు. మీమీ సమస్యలను మీరు అర్థం చేసికోపోతే, కొంతమంది నాయకులు - వాళ్లెంత పెద్దవాళ్లయినా సరే - మిమ్ములను సరియగు మార్గానికి తీసుకుపోలేరు." కాబట్టి నాయకుల సవరించగల ఆత్మవిశ్వాసము, కాంగ్రెసు అనుచరులలో ఏర్పడాలి. కరాచీ ప్రాథమిక హక్కుల మొదలుకొని, త్రిపురీ జాతీయవాంఛా తీర్మానము కలకత్తా యుద్ధవ్యతిరేక తీర్మానాలను దేశమంతటా ప్రబోధించాలి ప్రబోధించిన నాడే మితవాద నాయకత్వము తమ 'డ్రిఫ్టు' విధానము మార్చుకొంటుంది. జవహర్‌లాల్ సైతంలేని ఈ 'ఒకేరకపు భావాలుగల నాయకత్వం' లో చలనము కల్గుతుంది.

ప్రపంచయుద్ధ సూచనలు, యుద్ధములో ఇండియాను ముక్కుతాళ్లు బిగించడానికి ఇండియా ఆక్టు సవరణలు. మనకు సువిదితమే. సామ్రాజ్యవాదులు మనపై దాడిసల్పుతున్నారు. ఈసంగతి పటేలువంటివారు కూడ గ్రహించకపోలేదు. "నేడు శత్రువు బలంగా ఉన్నాడు. ఆత్మవిశ్వాసంతో ఉన్నాడు. మనము బలహీనముగా ఉన్నాము." అని అంగీకరించాడు. కాని ఈ బలహీనతకు కారణము, మంత్రులు చేసే ప్రతిపనినీ సమర్థించక "సత్యాగ్రహాలు, అసహకారాలూ" అతివాదులు చేయడమువల్లనని తలచుతున్నాడు. ఇది పొరపాటు. నేడతివాదులు ఆర్థిక హక్కులకై పోరాడుచున్నా పోరాటాలను బలపఱచడము వల్ల ఈ బలహీనత రాలేదు. "విదేశీవారికంటె తక్కువ ఖర్చులతో ఎక్కువ సామర్థ్యంతో ప్రభుత్వాన్ని నడపగలమని నిరూపించుటకు" (పటేలు బృందావన ఉపన్యాసం) ప్రయత్నించి సంతృప్తి పడుట వలన ఈ బలహీనత గల్గినది.

"ప్రభుత్వాన్ని, సంస్థానాధీశులను వెస్టెడ్ ఇంట్రస్టున్నూ ఒకేసారి పోరాడాలి." ఇది నిజమే. కాని దానికి "ఒకే మనస్సు గల్గిన సంస్థగా కాంగ్రెసు" ఉండాలని పటేలు భావించుచున్నాడు. ఇది హానికరము. నేడు దేశంలో అన్ని సామ్రాజ్య వ్యతిరేక శక్తులనూ కూడగట్టుకొని; పోరాటమునందు ధ్యానముంచితేనే శత్రువును ఎదిరించగలం. ఈ సత్యాన్ని ఎంత త్వరగా గ్రహించితే అంతమంచిది. గ్రహించేటట్లు చేయవలసినది అతివాదులు.

# విశ్వరాజకీయాలు

ఈ నెల 6 వ తేదీని సుభాష్‌బోసు కలకత్తాలో జరిగిన ఒక బహిరంగసభలో ఉపన్యసిస్తూ, కొత్తవర్కింగ్ కమిటీ నియామకపు విషయములో మితవాద ప్రముఖులు, గాంధీజీ, చూపిన మొండి పట్టుదలకు ఉదాహరణముగా కొన్ని కొత్త వివరాలు తెలియజేశాడు. బోసు గాంధీజీ అభిప్రాయము ప్రకారము వర్కింగ్ కమిటీ మెంబర్లతో సంప్రతించడానికి వెళ్లేడు. మొదట రాజేంద్రప్రసాద్ వద్దకు వెళ్లి. కొత్తవర్కింగ్ కమిటీలో నలుగురు నూతన సభ్యులు. 10 మంది పాతసభ్యులు. ఉండడం మంచిదని సూచించాడు. మొత్తం వర్కింగుకమిటీలో మెజారిటీ, త్రిపురీ కాంగ్రెసుకు పూర్వం

కలకత్తాలో కాంగ్రెసు నాయకులు చూపిన మొండి పట్టుదల



గాంధీజీ

రాజీనామా యిచ్చిన 7 గురు సభ్యులకే ఉండేలాగు యీ సూచన చేశాడు. కొత్త సభ్యులపేర్లు కూడా సూచించాడు. తరువాత మౌలానా అజాద్ యింటివద్ద మాట్లాడినప్పుడు, ఆనలుగురు పేర్లకు వర్కింగ్ కమిటీ సభ్యులు అంగీకరించలేదు. తమకు తోచిన నలుగురు కొత్తపేర్లను సూచించారు. జవహర్లాల్ నెహరూను కాంగ్రెసు కార్యదర్శిగా ఉంచడానికి కూడా వారంగీకరించారు. అనగా, పేర్ల విషయంలోనే భేదాభిప్రాయము వచ్చిందిగాని, కొత్తసభ్యుల్ని చేర్చుకోవలసిన అగత్యాన్ని వారు గుర్తించారు. ఇది జరిగిన వెంటనే, అందరూ కలిసి గాంధీజీ వద్దకు వెళ్లారు. కాని అక్కడ పాతవర్కింగ్ కమిటీని, ఉన్నది ఉన్నట్లుగా, నియమించాలని సూచన చేయబడింది. సహజముగా బోసు నిర్ఘాంతపోయాడు. గాంధీజీ కూడా వారినే సమర్థించాడట.

వర్కింగ్ కమిటీలో కొంతకాలం అయాక రెండు స్థానాలు ఖాళీ అవుతవనీ, వాటిలో యిద్దరు కొత్త వారిని వేసుకోవచ్చునని తెలియ జేయబడింది. బోసు. యిప్పుడే ఆరెండు స్థానాలను నింప కూడదా అని అడిగాడు. ఇప్పుడు పనికి రాదని జవాబు వచ్చింది. పోనీ ఖాళీలు ఏర్పడి నప్పుడైనా తన యిష్టంవచ్చిన యిద్దర్ని నియమించ వచ్చునా అని ప్రశ్నించి, రెండు పేర్లు సూచించాడు. ఈ రెండింటినీ కూడా మితవాద ప్రముఖులు నిరాకరించారు. పోనీ, వారియిష్టంవచ్చిన కొత్తసభ్యుల్నే నియమించి, ఒకనిని మాత్రం సహాయ కార్యదర్శిగా కలకత్తాలో ఉండే పద్ధతిమీద తీసుకొంటానని బోసు అన్నాడు. కాని, వర్కింగ్ కమిటీ సభ్యులుపట్టిన పట్టు భల్లూకపు పట్టు। ఏలాగైనా బోసుచేత రాజీనామా యిప్పించాలని వారి నిశ్చయం. కనుక, ఈ సూచనకు కూడా వారు అంగీకరించ లేదు.

గాంధీజీ కూడా వీరికే మద్దత్తు చేశాడు. పూర్తిగా అతివాదులతో ఉన్న వర్కింగ్ కమిటీకి తన అంగీకారాన్ని సూచించినట్లు అ. భా. కాం. కమిటీలో ప్రకటించనా అని బోసు యింతకు పూర్వం అడిగినప్పుడు వల్ల కాదన్నాడు. పోనీ, పాతవర్కింగ్ కమిటీనే, ఉన్నది. ఉన్నట్లు. నియమించి దానికి బాధ్యత గాంధీజీది అని అ. భా. కాం. కమిటీలో ప్రకటించడానికి కూడా గాంధీజీ అంగీకరించ లేదు. కాని, రాజేంద్రబాబు కొత్తగా అధ్యక్షుడై, పాతవర్కింగ్ కమిటీనే పూర్తిగా నియమించినప్పుడు మాత్రం గాంధీజీ తన అంగీకారం తెలిపాడు।

ఈ విధంగా, మితవాదులు గాంధీజీ కలసి బోసు కాళ్ళూ, చేతులూ కట్టివేసి, రాజీనామా యిప్పించారు. ఆహా! కాంగ్రెసులో అతివాదులే చీలికలు కలిగిస్తున్నారని మాటి మాటికీ రాళ్ళు రువ్వే హేమా హేమీలు మొండిపట్టుదల విషయంలో అద్వితీయులనిపించుకొని, కాంగ్రెసు ఐక్యతను గడ్డిపరకతో సమానంగా చూచారు।

వీరిచేతుల్లో అతివాదులు ఏమవుతారో ముందు చూడవలసి యుంది.

ఒకవైపు కాంగ్రెసు నాయకులు ఈ విధంగా అతివాదుల్ని దూరం చేసుకొని తమ పట్టుదలకే యెక్కువ ప్రాధాన్యత యిస్తూంటే, మరొక వైపునుంచి సామ్రాజ్యవాదులు మన మీదికి శరవేగంతో దుముకుతున్నారు. ఇండియా అండర్ సెక్రటరీ మూర్‌హెడ్ పార్లమెంటు సభలో ఒక లేబర్ సభ్యుడడిగిన ప్రశ్నకు జవాబు చెపుతూ, భారతీయులు ఎంత గట్టిగా వ్యతిరేకించినప్పటికీ తానుప్రవేశపెట్టబోయే ఇండియా ఆక్టు సవరణ బిల్లును ఏమాత్రము ఉపసంహరించుకొనడానికి వీల్లేదని ఘంటాపథముగా పలికాడు. ఈ బిల్లు ప్రకారము, యుద్ధంవస్తే రాష్ట్రీయ ప్రభుత్వాల మీద వైస్రాయికి సర్వనియంతృత్వం యివ్వబడుతుంది. కలకత్తా అ. భా. కాం. కమిటీలో జవర్లాల్ చే ప్రతిపాదించబడిన యుద్ధప్రతికూల తీర్మానము ప్యాసైన కొద్దిగంటల తర్వాతనే మూర్‌హెడ్ పార్లమెంటులో పైవిధముగా పలికాడు। ఇప్పుడైనా మన నాయకులు కదిలి, కాంగ్రెసు ఐక్యతను కాపాడటములో, యుద్ధము వచ్చినప్పుడు బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఢీకొనడంలో, తమ చాకచక్యాన్ని ప్రదర్శిస్తారా?

పార్లమెంటులో మూర్‌హెడ్ జవాబు

సుభాష్‌బోసు రాజీనామా యివ్వడం చూచి బ్రిటిష్ ప్రభువులు చంకలు గుద్దుకుంటున్నారు. "బోసు రాజీనామా యివ్వడమువల్ల శని విరగడ అయిపోయింది" అని మ్యాంచెస్టర్ గార్డియన్ పత్రిక వ్యాఖ్య వ్రాసింది. యుద్ధంవస్తే, గ్రేట్ బ్రిటన్‌తో తక్షణము సంబంధము తెంచివేసుకోవాలని సుభాష్‌బోసు చూస్తున్నాడట. కాని, గాంధీ - రాజేంద్రప్రసాదులు యుద్ధసమయములో తమ దేశానికి కొన్ని సదుపాయాలు సంపాదించడానికి ప్రయత్నిస్తారట. అయితే, బ్రిటన్ ఓడిపోయినందువల్ల తమ దేశము మరొక యూరపియన్ రాజ్యం క్రిందపడి, ఇప్పటికంటె కూడ ఎక్కువ నిరంకుశత్వానికి గురికావలసి వస్తుందనికూడా వీరికి తెలుసు." అని డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక వ్రాసింది.

బ్రిటిష్ పత్రికల వైఖరి.

ఈవిధముగా సంతోషిస్తున్నారు బ్రిటిష్ వారు, సుభాష్‌బోసు రాజీనామాను చూచి. వీరి ఆశలు అడియాసలు కావాలంటే, కాంగ్రెసు ప్యాసుచేసిన యుద్ధప్రతికూల తీర్మానాన్ని ఆచరణలో పెట్టాలంటే, సమర సన్నాహం యిప్పటినుంచీ చేయాలి. 1914 లో గాంధీ చేసిన "హిమాలయ పర్వతమంతటి పొరపాటు" మళ్లీ 1939 లో చేయకుండా జాగ్రత్త పడాలి.

కానీ: యుద్ధంలో ఇండియా గ్రేట్ బ్రిటన్‌కు సహాయముచేయవలసి యుంటుందని కొందరు కాంగ్రెసు మంత్రులు అభిప్రాయ పడుతున్నట్లు సూచనలు కనుపిస్తున్నాయి. మద్రాసులో జరిగిన ఒక బహిరంగసభలో రాజగోపాలాచారి మాట్లాడుతూ, రేపురాబోయే యుద్ధములో గ్రేట్ బ్రిటన్ ఫేసిస్టు నిరంకుశ రాజ్యాలకెదురుగా నిలబడి పోరాటము సాగించడానికి ప్రజాస్వామ్య ప్రభుత్వాలతో కలుస్తుందని పలికాడు. "సామ్రాజ్యవాద యుద్ధాలు పనికిరావు। పనికిరావు" అని యింటి

రాబోయే యుద్ధము మనరాజాజీ



కప్పెంకులెగిరిపోయేటట్లు అరిచే సోషలిస్టులు యీ నినాదాలద్వారా ఫేసిస్టు రక్తపిపాసులకే ఎక్కువ బలము చేకూరుస్తున్నారనికూడా రాజాజీ అన్నాడు. ఇంగ్లండు నేడు సోవియట్ రష్యాతో మిత్రభావము కలిగి యున్నదట।



రాజాజీ

ఫేజిజాన్ని అరికట్టడానికి ప్రజాస్వామ్యాన్ని ఎప్పుడూ సోవియట్ బలపరుస్తుంది. ఇది కొత్త గాదు. రష్యా బ్రిటన్‌తో కలిస్తే, మనం మాత్రము ఎందుకు కలవరాదనీ సూచన రాజాజీ ప్రశ్నలో వస్తుంది. మనది బానిసదేశము, రష్యా స్వతంత్ర దేశము. స్వాతంత్ర భారతదేశమే ప్రజాస్వామ్యరక్షణకైనా యుద్ధంలో పాల్గొంటుంది కాని, బానిస భారతదేశముకాదు. రష్యాతో నిజముగా బ్రిటన్ మోసగించకుండా స్నేహపూర్వకముగా ఉండాలన్నా, భారతదేశానికి స్వాతంత్ర్యము అవసరము. ఇది రాజాజీ గమనించాలి।

హైదరాబాదు సంస్థానములో ఆర్యన్ సమితి తరపున సత్యాగ్రహంలో పాల్గొనిజైళ్లకు వెళ్లిన అనేకమందిని సంస్థాన ప్రభుత్వం జైళ్లలో చెప్పరాని బాధలు పెట్టి హింసిస్తున్నదని చాలా రోజులనుంచి వార్తలు వస్తున్నాయి. కాని మొన్న యీమధ్య ప్రకటించబడిన వార్తలు హృదయవిదారకమైనవి. ఒక సత్యాగ్రహి హైదరాబాదు జైలులోను, మరొకసత్యాగ్రహి గుల్బర్గాజైలులోను, మృతినొందారు. ఒకని శరీరము నిండా బలమైన లాఠీదెబ్బలు కనబడ్డాయి. రెండవవాని తలవెనుక ఒకగాయము, ముక్కులో రక్తము, నడ్డిమీద లాఠీదెబ్బలు, ఉన్నాయి. ఈవిషయములో విచారణచేయుటకు తగిన యేర్పాట్లు గావించ వలసిందని హైదరాబాదు ప్రభుత్వానికి ప్రజలుఎన్ని విజ్ఞప్తులు పంపుకున్నా, ప్రయోజనం లేకపోయింది.

హైదరాబాదు సత్యాగ్రహుల మరణము

ఢెంకనాల్ సంస్థానంలోకూడా రాజకీయ ఖైదీలపై జరుపబడుతూన్న దౌర్జన్యాలు వర్ణనాతీతం. దీనబంధు మాలిక్ అనే 65 సంవత్సరముల వయస్సుగల ఒక హరిజన రాజకీయ ఖైదీ గత మార్చిలో నిరశనవ్రతం పూనినప్పుడు జైలు అధికార్లు అతనిని క్రూరంగా కొట్టుటవల్ల దరిమిలాను ఏప్రిల్ 10 వ తేదీని మరణించినాడు, సుమారు 60 మంది రాజకీయ ఖైదీలు తిండి, వార్తాపత్రికలు, సుఖమైనపని మొదలైన సాధారణ హక్కుల కొరకు ఏప్రిల్ 12 వ తేదీనుండి నిరశన వ్రతం ప్రారంభించారు. వీరిలో కొందర్నిచేతులకు సంకెళ్ళువేసి, దూలాలకు వేళ్ళాడతీసి, లాఠీలతో కొట్టారట. ఇంకా అమానుషమైన పనులెన్నో చేస్తున్నారట.

సంస్థానాలలో కాంగ్రెసుచేత ప్రజా ఉద్యమాన్ని ఆపుచేయించిన మహాత్ముడు యీ రాక్షస కృత్యాలకు ఏమంటాడో చూడాలి. మహాత్ముడు వాటిని నివారించడానికి అసమర్థుడైతే ప్రజలే ధైర్యం వహించి, ఉద్యమానిని తిరిగి ప్రారంభించవలసి యుంటుంది.

యస్. సత్యమూర్తి బొంబాయిలో ఒక బహిరంగ సభలో ఉపన్యసిస్తూ, బ్రిటిష్ ప్రభుత్వము, ఫెడరేషన్ ని ప్రవేశపెట్టితే, కాంగ్రెసు దాన్ని స్వాధీన పరచుకొంటుందన్నాడు. ఒకవైపు కాంగ్రెసు మహాసభ ఫెడరేషన్‌ని ధిక్కరించడానికి ప్రజలు సన్నాహాలు చేయవలసిందని తీర్మానించి యుండగా, సత్యమూర్తివంటి రాజకీయవేత్తలు ఫెడరల్ శాసనసభలకు పోటీచేసి, మంత్రిపదవులు తీసుకుందామని చూస్తున్నారు. కాంగ్రెసు తీర్మానాలను ధిక్కరించే యిట్టి నాయకులు దేశానికి తీరని అపకారము కాదు. ద్రోహం - చేస్తున్నారు. ఒకసారి సత్యమూర్తికి కాంగ్రెసు వర్కింగ్ కమిటీ తరపున పూర్వము బోసు వార్నింగ్ యిచ్చి యున్నప్పటికీ, యీ పెంకిఘటం ఇంతే. రాజేంద్రబాబు మరొకసారి వార్నింగ్ యిచ్చి, వీని నాలుకకు తాళంవేయగలడేమో చూడాలి. అయితే, భూలాభాయి, వల్లభాయివంటి వర్కింగుకమిటీ మెంబర్లే కాంగ్రెసు తీర్మానాలను ధిక్కరిస్తూ ఉపన్యసించేటప్పుడు సత్యమూర్తిని ఏ మొగంతో మందలిస్తారు?

సత్యమూర్తి ఫెడరేషన్.

మన వ్యవసాయశాఖామాత్యుడు మునుస్వామి పిళ్లై విశాఖపట్నము ఏజన్సీలో సంచారము చేస్తున్నప్పుడు వందలాది కోయప్రజలు ఈయన వద్దకు వచ్చి, తమ్ము ఏవిధంగా ఎస్టేటు ఉద్యోగస్థులు పీల్చి పిప్పిచేస్తున్నారో నమ్మశక్యంకాని విషయాలెన్నో పూసగుచ్చినట్లు చెప్పారు. కాంగ్రెసు ఎం. ఎల్. ఏ. డి. వి. రామస్వామిగారు కూడా మంత్రిగారిని సందర్శించి. "కోయలమీద బనాయించ బడుతూన్న కేసుల సంఖ్య ఎవరికైనా విస్మయాన్ని కలిగిస్తుందని చెప్పారు. కట్టుకొనడానికి గుడ్డ సహితంలేని యిద్దరు కోయిస్త్రీల మీద కేసులు పెట్టి, వారిని కోర్టుకు యీడ్చి నాలుగేసి అణాలు జుల్మానా విధిస్తే, వారది చెల్లించలేక పోయినప్పుడు మేజస్ట్రీటే స్వయంగా చెల్లించాడట."

అ. భా. ఏజన్సీ మహాసభ

ఈ వర్ణనలన్నీ శాంతముగా విన్న తరువాత మునుస్వామిపిళ్ళె చెప్పిన జవాబు విన్నప్పుడు వారి కళ్ళవెంబడి నీళ్ళు ప్రవహించాయో, రక్తం ప్రవహించిందో, అనుమానం వేస్తుంది. "మీరు అనవసరంగా మీ ఉద్యోగస్థులతో పేచీలు పడకండి" ఇదీ అతడు వారికిచ్చిన సలహా! ఈయనది మానవహృదయమో, లేక నల్లరాతి గుండెయో, బోధపడదు. పైగా, ఈతడు "కాంగ్రెస్" మంత్రి పుంగవుడు.

బీహారు-బొంబాయి-ఒరిస్సా రాష్ట్ర శాసనసభలు యితర వెల్లడి ప్రదేశాలమాదిరిగానే ఏజన్సీ ప్రదేశాలను కూడా పరిపాలించేటట్లు చూడవలసిందని కేంద్ర ప్రభుత్వానికి సిఫార్సుచేస్తూ ఏకగ్రీవంగా తీర్మానాలు చేస్తే, మన మద్రాసు శాసనసభ్యులు మాత్రం యింతవరకు కండ్లు తెరువలేదు. ఈ నిర్లక్ష్య భావాన్ని యిప్పటికైనా విడిచిపెట్టుతారా, మన ప్రజాప్రతినిధులు?

ఈ మధ్య బృందావన్ (బీహారు) లో జరిగిన గాంధి సేవాసంఘ సమావేశంలో సర్దార్ వల్లభ భాయి పటేల్ ఉపన్యసిస్తూ, "జమీందార్లందరినీ అండమాన్ దీవులకు పంపివేసి, జమీందారీ విధానాన్ని పూర్తిగా నిర్మూలిస్తే పరిస్థితులు బాగుపడతాయని భావించడం పొరపాటు" అన్నాడు. జమీందారీవిధాన నిర్మూలన మన ప్రజలను బాగుపరచజాలదని భూలాభాయి దేశాయి కూడా ఉపన్యసించాడు. అనేక రాష్ట్రకాంగ్రెసు కమిటీలు, మహాసభలు జమీందారీ విధాన నిర్మూలనాన్ని గురించి ప్యాసు చేసిన తీర్మానాలు ఈ నాయకులిద్దరికీ రుచించక పోవచ్చు. కాని, 1931 లో జరిగిన కరాచీ అ. భా. కాంగ్రెసు మహాసభలో ప్యాస్ చేయబడిన ప్రాధమిక హక్కుల తీర్మానంలో జమీందారీ విధాన నిర్మూలన ఒక అంశము. విచిత్రవిషయం ఏమంటే జమీందారీ విధానం ఉండాలి, అని ఈరోజున చెపుతూన్న సర్దార్ వల్లభాయి పటేలే ఆరోజున

జమీందారీ విధానం : కాంగ్రెసు నాయకులు.



సర్దార్ పటేలు

కరాచీ కాంగ్రెసుకు అధ్యక్షుడు। కాంగ్రెస్ తీర్మానాలంటే ఇంత నిర్లక్ష్యం, ఇంత అవిధేయత గల కాంగ్రెస్ నాయకులు ఏవిధంగా తమ అనుచరులలో కాంగ్రెసు డిసిప్లిన్ అలవరచగలరో బోధపడకుండా ఉంది. దౌర్జన్యంగా భూములు స్వాధీనం చేసుకోవడాన్ని నిరసిస్తూ బృందావన్‌లో గాంధీజీ ఉపన్యసించాడు. కాని, బీహార్ రాష్టంలో దాదాపు 1 సంవత్సరం నుంచీ జరుగుతూన్న రైతు సత్యాగ్రహాలు శాంతియుత పద్ధతుల ప్రకారమే నడుపబడుచు వందలాది రైతులు, సుప్రసిద్ధ కాంగ్రెసువాదులు, జైళ్ళకు వెళ్ళడం చూస్తూకూడా గాంధీజీ దౌర్జన్య విషయమై ప్రస్తావించుట శోచనీయం.

# కలకత్తా కాంగ్రెస్ ముచ్చట్లు

మా ప్రత్యేక ప్రతినిధి.

ఏప్రిల్ 28 వ తేదీ వర్కింగు కమిటీ సమావేశం. 29 వ తేది అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశము జరుగుతుందని కలకత్తాకు వెళ్లిన సభ్యులందరికి తెలిసిన విషయమే. గాంధిజీతో సుభాసుబోసు. జవ్హారిలాల్ నెహ్రూలు సంప్రదింపు చున్నారని, వర్కింగుకమిటీ నియామకము, ఆసంప్రదింపుల మీద ఆధారపడి యుండునని కూడ అందరూ ఆశించియుండిరి. అందుచే 28 వ తారీఖు ఉదయము పత్రికలలో వర్కింగుకమిటీ సభ్యులపేర్లు లేనపోవుటచే కాంగ్రెసులోని విషమపరిస్థితికి ఇంకను పరిష్కారము కాలేదని ఆతురతతో పర్యవసానము కొరకు ఎదురు చూడసాగిరి.

### గాంధిగారి నాన్‌కోపరేషన్

సుభాసుబోసు సంయుక్త వర్కింగు కమిటీ కావాలన్నాడు. గాంధిజీ అంగీకరించలేదు. అంతేగాక త్రిపురి తీర్మానము ప్రకారము వర్కింగుకమిటీ సభ్యులను సూచించడానికి కూడ ఒప్పుకొనలేదు. ఈ వరకు వర్కింగు కమిటీ సభ్యులతో సంప్రదించి ఒక రాజీకి వస్తే తనకేమి అభ్యంతరము లేదన్నాడు. లేదా సుభాసుబోసు తన కిష్టమువచ్చిన వర్కింగుకమిటీని - అతివాదులతో కూడిన వర్కింగు కమిటీని - నియమించి ఏ. ఐ. సి. సి. ముందుపెట్టవచ్చునన్నాడు. సుభాసు దీనికి అంగీకరించలేదు. కారణాలు రెండు. ఒకటి మితవాదులు లేని వర్కింగుకమిటీ సంయుక్త వర్కింగు కమిటీ కాజాలదు. అందుచే కేవలము అతివాదులతో కూడిన వర్కింగుకమిటీ ప్రస్తుతము దేశీయులందరి విశ్వాసము చూరగొనలేదు. అందుచే పోరాటాన్ని జయప్రదముగా కొనసాగించలేదు. రెండవకారణము, త్రిపురి తీర్మానము ప్రకారము గాంధిజీకి ఈవర్కింగు కమిటీయందు విశ్వాసముండాలి. అయనే పేర్లు సూచించాలి. అలాచేయకపోతే త్రిపురి తీర్మానాన్ని అమలు జరుపలేదని విశ్వాసరాహిత్య తీర్మానము సుభాసుబోసు మీద తప్పక ఏ. ఐ. సి. సి. లో వచ్చేది.

జవ్హారిలాల్‌కూడ గాంధిజీతో ఎంతో దూరము చెప్పి చూచాడు. లాభము లేకపోయింది. కడకు గాంధిజీకి ఇష్టము వచ్చిన వర్కింగు కమిటీనైనా సూచించమని కోరాడు. దానికీ గాంధిజీ అంగీకరించ లేదు. "సుభాసుబోసు ఎన్నికపిదప,పట్టాభి ఓటమి నాదోటమి" అని ప్రకటించిన గాంధిజీయే,దానిఫలితంగా కాంగ్రెసులో గతమూడు మాసాలుగ జరిగిన విషయాలు ఏమి జరుగనట్లు, సుభాసును తన కిష్టమువచ్చిన వర్కింగు కమిటీని ఏర్పరచుకో మనడము అర్థము లేద"ని జవహర్ విసుగుకొన్నాడని ఒక వదంతి ప్రాకింది. జవ్హారిలాల్ నెహ్రూ మితవాద నాయకుల ధోరణిని తీవ్రంగా ఆసంప్రదింపులలో విమర్శించాడని కూడ ఒక కబురువచ్చింది.

### బోసు—నెహ్రూల ప్రయత్నం

ఇక గత్యంతరము లేక ఇదివరకు వర్కింగు కమిటీ సభ్యులతో సంప్రదింపులు బోసు నెహ్రూలు ఆరంభించారు. మౌలానా అబుల్‌కలం అజాద్‌వద్దకు వెళ్లారు. ఇదివరకు వర్కింగు కమిటీ సభ్యులలో నలుగురిని వదిలివేసి, క్రొత్తవారిని నలుగురిని వేసుకోవడము జవ్హారిలాల్ నెహ్రూ ప్రధాన కార్యదర్శిగా ఉండడము మౌలానా రాజీగ సూచించాడు. తనకు వర్కింగు కమిటీలో ఉండుటకే ఇష్టము లేక పోయినను, నెహ్రూ కాంగ్రెసు ఐక్యత కొరకు కార్యదర్శిగా ఉండుటకుకూడ అంగీకరించాడు. సుభాసుబోసు చాల సంతోషంగా రాజీకి అంగీకరించాడు. నెహ్రూకార్యదర్శిగా ఉన్నప్పుడు ఇక కావలసిన దేమిటి?

బోసు, క్రొత్తగా వర్కింగుకమిటీలో తీసుకోడానికి ఏడుగురుపేర్లు సూచించాడు. వారిలో నలుగురిని తీసుకోవాలి. ఈపేర్లలో శ్రీనివాసయ్యంగారు నారిమన్ అనే పేర్లు లేనేలేవు.సుభాసుబోసు, పైవారిని వర్కింగు కమిటీలోకి తీసుకొంటాడని భయపడుతూ ఉండేవారి భయము కేవలము నిరాధరమని తెల్పాడు. అంతేగాదు. తాను సూచించిన పేర్లను మార్పుచేయడానికి కూడ తాను తయారుగ ఉన్నట్లుకూడ ప్రకటించాడు. జమన్‌లాల్ బజాజ్, జయరాందాస్ దౌలత్‌రాం. హరికృష్ణ మెహతబ్, శంకారరావుదేవులను క్రొత్త వర్కింగు కమిటీలో వేసుకోరని అందరూ అనుకో సాగారు. రాజీ కుదిరిందని సంతోషించిరు.

### గాంధిగారి మొండిపట్టు.

కాని మౌలానా అబుల్‌కలాం అజాద్ ఇంటినుండి, గాంధిజీ మకామునకు నాయకులందరు బయలుదేరారు. మితవాద నాయకులు గాంధిజీతో సంప్రదించారు. గాంధిజీ గాని, మితవాద నాయకులు గాని ఈరాజీకి అంగీకరించలేదు. గాంధిజీ కృపాలినీయే కార్యదర్శిగా ఉండాలనీ, మునుపటి వర్కింగు కమిటీ సంతటిని తిరిగి నియమించాలనీ చెప్పాడు. జమన్‌లాల్ బజాజ్, జయరాందాస్ దౌలత్‌రాం, వీరిరువురూ, అనారోగ్యంగా ఉండుటచే ఈక్రొత్త వర్కింగు కమిటీనుండి త్వరలో రాజీనామా ఇచ్చేటట్లు చూస్తాననీ, వారిస్థానములో అందరూ అంగీకరించిన ఇరువురిని బోసు నియమించవచ్చునని సూచించాడు.రాజీ ఆశలన్నీ అడుగంటాయి. బోసు అప్పటికీ కాంగ్రెసు ఐక్యతనే ప్రధానంగా పెట్టుకొని, గాంధిజీ సూచన ప్రకారము ఈవర్కింగు కమిటీనే నియమించుటకు అంగీకారము తెల్పుతూ ఇది గాంధిజీ సూచన ప్రకారము నియమించ బడినదని ఏ. ఐ. సి. సి. లో ప్రకటించుటకు గాంధిజీ అనుమతిని అడిగాడు. గాంధిజీ అనుమతి నివ్వ నిరాకరించాడు. కారణాలు గాంధిజీ తన జాబులో తెలియజేశాడు.

### రాజీనామా

బోసుకు మార్గమేమీలేక పోయింది. ఇక రాజీనామా ఇవ్వక తప్పిందికాదు.

29 వ తారీఖు సాయంకాలము 5 గంటలకు ఏ.ఐ.సి. సి. సమావేశమయినపుడు బోసు తన రాజీనామాను ముందు పెట్టాడు. వెంటనే జవ్హారిలాల్ నెహ్రూ ఒక ప్రకటన గావిస్తూ ఒక ఉపన్యాస మిచ్చాడు. ప్రస్తుత అంతర్జాతీయ, జాతీయపరిస్థితులలో బోసురాజీనామా చాల నష్టకరము. కాంగ్రెసులో చీలిక పనికిరాదన్నాడు. కాంగ్రెసు వర్కింగుకమిటీలో క్రొత్తవారిని ప్రతిసంవత్సరమూ తీసుకోవాలి. దీనిమూలాన చాలమందికి ఉద్యమమును నడుపుటకు రావలసిన అనుభవము కల్గుతుంది. వర్కింగుకమిటీకూడ నూత్నతేజముతో పని చేయడానికి వీలవుతుంది. కాని గతసంవత్సరము జరిగిన పనితో సంబంధముంచుకొని, పనిని జయప్రదముగా, సులభముగా సాగించుటకు గత వర్కింగు కమిటీలో మెజారిటీని క్రొత్తవర్కింగు కమిటీలో వేసుకోవాలి. ఈ సంవత్సరానికి జమన్‌లాల్ బజాజ్, జయరాందాస్ దౌలత్‌రాం లు త్వరలో విరమించుకుంటారు. వారి స్థానాన్ని క్రొత్తవారిని వేసుకోడానికి బోసుకు వీలుంటుంది. అందుచే రాజీనామాను ఉపసంహరించు కొనమని కోరాడు. కాని తాను తీర్మానమేమీ అప్పుడు ఉపపాదించలేదు.

### జవహర్ తీర్మానం

టీకి, ఏ.ఐ.సి.సి. తాత్కాలికంగా సభను ముగించి. పిదప తిరిగి సమావేశమయింది. రఫీ.అహమ్మద్ కిద్వాయి జవ్హారిలాల్ సూచనను బలపరుస్తూ మాట్లాడాడు. తన ఉపన్యాసము ఆఖరున జవ్హారులాల్ తీర్మానాన్ని చదివాడు. తీర్మానములో బోసును రాజీనామాను పసంహరించుకొని మునుపటి వర్కింగు కమిటీనే తిరిగి (నామినేటు చేయమని) నియమించమని ఉంది.

ఖిద్వాయి మాట్లాడుతూ ఉండగనే, సోషలిస్టులు కమ్యూనిస్టులు, జవ్హారిలాల్ ప్రకటనను బరపరచుటకు నిశ్చయించుకున్నారు. కామ్రేడ్ జయప్రకాశనారాయణ వేదికపైకి వచ్చాడు. జవ్హారిలాల్ ప్రకటన తమకు పూర్తిగా సంతృప్తికరముగా లేకపోయినా, కాంగ్రెసులోని చీలికను తొలగించడానికి, అది పూర్తిగ సరిపోక పోయినా, ఇక గత్యంతరము లేక, కాంగ్రెసు ఐక్యత, జాతీయపోరాట ఐక్యతను గమనించి. తాము జవ్హారిలాల్‌నెహ్రూ ప్రకటనను బలపరుస్తున్నామని చెప్పాడు.

కాని ఖిద్వాయిచదివిన జవ్హారిలాల్ తీర్మానములో వర్కింగు కమిటీలో ప్రతి సంవత్సరము క్రొత్తవారిని తీసికోవాలని సూత్రములేదు. ఈసంవత్సరము త్వరలో రెండు ఖాళీలు ఏర్పడతాయి. వానిస్థానాన క్రొత్తవారిని బోసు నియమించ వచ్చునన్న సూచనలు లేవు.

అందుచే సోషలిస్టులు, కమ్యూనిస్టులు, తిరిగి ఆరోజురాత్రి తమ వైఖరిని నిర్ణయించు కోడానికి వేరు వేరుగా సమావేశమై చర్చించారు. జవ్హారిలాల్ ప్రకటనలో, సంయుక్త వర్కింగు కమిటీకి కొంత తావుంది. కాని తీర్మానములో ఆభావమేలేదు. మునుపటి వర్కింగు కమిటీనే తిరిగి నామినేటు చేయవలసినదిగా బోసును కోరడము, బోసు ఏసంయుక్త వర్కింగు కమిటీని కోరాడో దానిని ఏమాత్రము అంగీకరించక, మితవాద నాయకుల ప్రిస్టేజ్ (గౌరవమును) కాపాడుటకు మాత్రమే పనికి వస్తుంది. అందుచే జవ్హారిలాల్ ప్రకటనకు అనుకూలంగా తీర్మానాన్ని సవరించమని నెహ్రూను కోరాలి. అలా సవరించక పోతే తీర్మానాన్నే వ్యతిరేకించాలని నిర్ణయించుకున్నారు. జవ్హారిలాల్ నెహ్రూ తన తీర్మానాన్ని తన ప్రకటనకు అనుగుణ్యముగా సవరించడానికి తయారయ్యాడు.

కాని తీర్మానాన్ని అలా సవరించడానికి మితవాద నాయకుల తరపున రాజేంద్ర ప్రసాద్‌బాబు నిరాకరించాడు. బోసుచే రాజీనామా పెట్టించాలని మితవాద నాయకులు కృతనిశ్చయులై యున్నప్పుడు, ఏమాత్రముకూడా సర్దుబాటు భావము వైఖరి చూపడానికి ఎలా తయారవుతారు?

అందుచే 30 వ తారీఖు ఏ. ఐ. సి. సి. సమావేశమయినపుడు జవ్హారిలాల్ నెహ్రూ బోసు తన తీర్మానానికి అంగీకరించక పోయినచో దానిని తాను ఉపసంహరించు కొంటానన్నాడు. బోసు తన దృక్పథాన్ని తెలియజేస్తూ ఒక ప్రకటన గావించాడు. సరోజిని మరియొక పర్యాయము బోసును తన రాజీనామాను ఉపసంహరించుకొనమని కోరింది. వర్కింగు కమిటీలో ప్రతిసంవత్సరమూ క్రొత్తవారిని తీసుకోవాలని తాను కూడ అంగీకరిస్తున్నా నన్నది. ఈ సంవత్సరానికి, బజాజ్, దౌలత్‌రాములేగాక ఇంకను ఎక్కువమంది రాజీనామాలు త్వరలో—వారాలలో కాదు. దినాలలో—తప్పక పెట్టి, ఇతరులకు చోటిస్తారు. అందుచే బోసు తన రాజీనామాను ఉపసంహరించుకోవా లన్నది.

### నెహ్రూ తీర్మానాన్ని ఉపసంహరించుకొనుట.

బోసు మాత్రము. ఏ. ఐ. సి. సి. తన దృక్పథాన్ని అంటే సంయుక్త వర్కింగుకమిటీని కొంత వరకైనా అంగీకరిస్తేనే తాను తన రాజీనామాను ఉపసంహరించుకోగలనన్న తన వాగ్మూలానికన్న తానేమీ చెప్పలేనన్నాడు. జవ్హారిలాల్ నెహ్రూ. తీర్మానాన్ని ఉపసంహరించుకోడానికి అనుమతికోరాడు. సోషలిస్టులు, కమ్యూనిస్టులుకూడ అంగీకరించారు. మితవాదులకు, అతివాదులకు, బోసుకూ, ఎవరికీ ఇష్టములేని తీర్మానాన్ని ఉపసంహరించుకోడానికి అందరూ అందరూ అంగీకరించారు.

మొదటినుండి బోసుచే రాజీనామా ఇప్పించాలని పంతము వహించియున్న మితవాద నాయకులకు మధ్య జవ్హారిలాల్ తీర్మానము కంటకముగా తోచింది. కాని చేసేదేమీ లేక ఊరుకున్నారు. కాని ఆతీర్మానమునుపసంహరించుకోగానే బోసు రాజీనామాను అంగీకరించినట్లుగనే భావించి క్రొత్త అధ్యక్షుని ఎన్నికకు తయారయ్యారు. జవ్హారిలాల్‌నెహ్రూ తీర్మానాన్ని ఉపసంహరించు కొన్నప్పుడు, మితవాద నాయకుల ముఖములోని కళ, నవ్వు, క్రొత్త అధ్యక్షుని ఎన్నిక కోసం వారు చూపిన ఆతురత, ఎంతో అసహ్యంగా కనబడింది.

మితవాదనాయకులు మొదట నుండీ బోసుచే రాజీనామా ఇప్పించాలని ఉన్నట్లు రుజువు చేయుటకు మరియొక ఘటన: ఏ. ఐ. సి. సి. ఫలితము మీద తన అభిప్రాయాన్ని ఒక పత్రికావిలేఖరికిస్తూ వల్లభబాయి నవ్వుతూ ఈలా అన్నాడు. "ఏ. ఐ. సి. సి. పర్యవసానము ఈలా అగునని నేను మొదటినుండీ అనుకున్నాను. నేను వెళ్ళకపోయినా నేను అనుకొన్న ప్రకారమే అయింది. వెళ్ళక పోబట్టి దీనికంతకు నేను కారకుడనని నిందమాత్రము నాపై లేకుండపోయింది" దీనినిబట్టే మితవాదనాయకుల ధోరణి ఈ విషయమందేమిటో అర్థము చేసుకోవచ్చు.

అంతేగాక, బోసుకోరినపుడు పేర్లను సూచించడానికి నిరాకరించిన గాంధిజీయే రాజేంద్రప్రసాద్‌చే నియమించబడిన వర్కింగుకమిటీకి తన అంగీకారము తెలియజ్జేయడము బోసుచే రాజీనామా నిప్పించడము గాక మరేమి?

### కామ్రేడ్ సర్‌దేశాయి తీర్మానం

ఈసందర్భములో జవహరిలాల్ నెహ్రూను గూర్చి ఒకటి రెండుమాటలు. సంయుక్త వర్కింగు కమిటీ కోసం బోసును బలపరుస్తూ చాల తీవ్రంగా,తెరచాటున ప్రయత్నించాడు. ఈ వర్కింగుకమిటీ నంతటిని తిరిగి నామినేటు చేయాలని గాంధిజీ, మితవాద నాయకులు, పట్టుపట్టినపుడు వర్కింగుకమిటీ వెస్టెడ్ ఇంటరెస్టు (శాశ్వత హక్కు) కాదనికూడ ఎత్తిపొడిచాడట. కాని బహిరంగంగామాత్రము జవ్హారిలాల్ పని అంత సంతృప్తికరముగా లేదు. కేవలము మితవాదు లంగీకరించిన తీర్మానాన్ని తాను ఉపపాదించడము, అతివాదుల చేతులను కొంతవరకు బలహీన పర్చింది. తన స్టేటు మెంటుకు, తీర్మానానికి, మధ్యనున్న భేదము తొలగించమని అతివాదులు కోరినపుడు అంగీకరించి రాజేంద్ర బాబు ప్రభృతులు అంగీకరించనందున తీర్మానాన్ని అలా సవరించక ఉపసంహ రించుకోవడము కూడ జవ్హారిలాల్ చేసియుండవలసినదికాదు. తాను తీర్మానాన్ని సవరించి, ఏ. ఐ. సి. సి. లో బహిరంగంగా బలపరచి ఉండవలసినది. పోనీ, కనీసము తన తీర్మానాన్ని ఉపసంహరించు కొనేటప్పుడు, మితవాదనాయకులు తాను చేయదలచుకొన్న సవరణలకు అంగీకరించలేదు.

తన తీర్మానాన్ని తన స్టేటుమెంటుకు అనుకూలంగా సవరించినచో బోసుకు అంగీకారయోగ్యముగా ఉండేది. అని ఏ ఐ. సి సి. కి జవ్హారిలాల్ తెలియజేసి యుండవలసినది. ఈలా చేయనందున జవ్హారిలాల్ నెహ్రూ తన తీర్మానాన్ని ఉపసంహరించుకోడానికి కారణం బోసు అంగీకరించక పోవడమేనన్న భావము ప్రజలందరికీ కలుగడానికి అవకాశమేర్పడినది. ఇది బోసుకు, అతివాదులకు అన్యాయము చేయడమే.

కాని దీనికి ప్రాయశ్చితంగా కాబోలు, నెహ్రూ వర్కింగుకమిటీలో ఉండడానికి నిరాకరించాడు. మితవాదనాయకులకు ఇది చాల దెబ్బ అని చెప్పకతప్పదు. పూర్తిగా అతివాదులందరూ, నెహ్రూతోసహా వారి వైఖరిని నిరసిస్తూన్నారని ప్రపంచానికి తెలియడము వారికిష్టములేదు.

మితవాద నాయకులు బోసుచే రాజీనామా నిప్పించుటకు కృతనిశ్చయులై వేగిరపడుతున్నా వారి ముందు వేరొక కంటకము తయారయింది. జవ్హారిలాల్ నెహ్రూ తీర్మానము ఉపసంహరించుకోగానే సోషలిస్టులు, కమ్యూనిస్టులు తిరిగి సంప్రదించుకొని వెను వెంటనే మరియొక తీర్మానాన్ని తెచ్చారు.

కామ్రేడ్ సర్‌దేశాయి సరోజినినాయుడు చేతికి ఆతీర్మానాన్ని అందిచ్చాడు. నెహ్రూ సరోజినీల వాగ్మూలములను, బోసు స్టేటుమెంటును ఆధారముగ తీసుకొని బోసు తన రాజీనామాను ఉపసంహరించుకో వలసినది అని ఆతీర్మానము కోరింది. ఈతీర్మానము ప్యాసయితే, బోసుకూడ తన రాజీనామా ఉపసంహరించుకో వచ్చునని మేమంతా ఎదురుచూశాము.

బోసు మొదటనుండి కోరుతూ ఉన్న సంయుక్త వర్కింగు కమిటీ సిద్ధాంతాన్ని ఈ తీర్మానము ద్వారా ఏ. ఐ. సి. సి. కొంతవరకు అంగీకరించు నట్లవుతుంది. ఎందుకంటే, నెహ్రూ, సరోజనీ ఉపన్యాసాలలో క్రొత్తవారిని ప్రతిసంవత్సరమూ వర్కింగు కమిటీలోకి తీసుకోవాలని ఉంది. ఆ ఉపన్యాసాలను ఏ. ఐ. సి. సి. అంగీకరించి వానిని ఆధారముగ జేసుకొని రాజీనామాను ఉపసంహరించు కొనమన్నప్పుడు, బోసు తన రాజీనామాను ఉపసంహరించుకోడానికి ఎట్టి అభ్యంతరమూ ఉండేది కాదు

అందుకనే సర్దేశాయి తీర్మానమును, సరోజిని చదివి విన్పించగనే మితవాద నాయకులు కలవర పడ్డారు. అప్పుడు వారిని చూచి ఉండవలసినది. సత్యమూర్తి, క్రొత్త అధ్యక్షుని ఎన్నికవిషయము చర్చ సాగుతూ ఉన్నప్పుడు ఈ తీర్మానము తేవడము పనికిరాదన్నాడు. సరోజినీ కాంగ్రెసులో ఇంత ప్రధాన సమస్యపై చర్చ జరుగుతూ ఉన్నప్పుడు ఇటువంటి అభ్యంతరాలు, పాయింటు అఫ్ ఆర్డరులు తీసుకరావడాన్ని తీవ్రంగా ఖండించింది. కానిస్టిట్యూషనుకు భంగమైనా తాను లక్ష్యము చేయనన్నది. తీర్మానాన్ని చర్చకు పెట్టింది. ఆతీర్మానానికీ జవ్హారిలాల్‌కుకూడ ఎట్టి అభ్యంతరమూ లేదని, జవ్హార్‌తో మాట్లాడిన పిదప, సరోజిని తెలిసికొనే, ఇంత గట్టిగా సత్యమూర్తిని మందలించింది.

### దత్తు పొరపాటు

దత్తు ముజుందార్. సర్ దేశాయి తీర్మానమును తాను ఉపపాదించి మాట్లాడాడు. దురదృష్టవశాత్తు తీర్మానముయొక్క భావాన్ని పూర్తిగా తలక్రిందు చేశాడు. తీర్మానములో ప్రాత వర్కింగుకమిటీని నెహ్రూ, సరోజినీలు సూచించిన మార్పులతో నియమించునట్లు బోసుకు సూచించబడింది. కాని దత్తు ముజుందారు తన ఉపన్యాసములో త్రిపురీ తీర్మానము, గాంధిజీ నిరాకరించుటచేత, రద్దు అయింది. అధ్యక్షునికి క్రొత్త వర్కింగుకమిటీని నియమించుటకు పూర్తి అధికారమున్నదనే ధోరణిని వెల్లడించాడు. మితవాద నాయకులను తీవ్రంగా విమర్శించాడు. ఫలితము సర్ దేశాయి తీర్మానానికి చాల సుముఖంగా ఉన్న ఏ. ఐ. సి సి. దత్తు ఉపన్యాసంతో పూర్తిగా వ్యతిరేకమయింది. సర్ దేశాయి తీర్మానమును మితవాద నాయకులు వ్యతిరేకించి యుంటే, తప్పు అంతా వారి నెత్తిమీద పడేది. బోసుచే ఏదో ఒక విధంగా రాజీనామా యిప్పించాలని వారాతురపడుతున్నట్లు ప్రపంచానికి బయటబడేది. కాని దత్తు ఉపన్యాసము, తీర్మానానికి క్రొత్త అర్థము ఇచ్చింది. అందుచే తీర్మానాన్ని వ్యతిరేకించడానికి మితవాదులకు చక్కని అవకాశము దొరికింది, అందుచేత తీర్మానము పొసగుటకు ఉన్న కాస్త అవకాశాలు దత్తు తన ఉపన్యాసముతో చెదరగొట్టాడు. సర్ దేశాయి తన ఉపన్యాసములో ఆ నష్టాన్ని పూడ్చడానికి ప్రయత్నించాడు గాని అది అసంభవమయిపోయింది. సోషలిస్టులు, కమ్యూనిస్టుల వైఖరికి పూర్తిగా వ్యతిరేకంగా దత్తు మాట్లాడడంతో అతివాదుల తమ ఆశలన్నీ మానుకొన్నారు.

ఏ సుభాసుబోసు రాజీనామా ఉపసంహరించుకోడానికి ఈ తీర్మానము తేబడిందో ఆ బోస్ దత్తు ఉపన్యాసముపిదప. తీర్మానాన్ని ఉపసంహరించు కొనమని కోరవలసి వచ్చింది. సర్దేశాయి తీర్మానాన్ని ఉపసంహరించుకొని మరలివచ్చాడు.

### కర్తవ్యం

బోసుచే రాజీనామాను ఇప్పించి తమ మనిషిని అధ్యక్షునిగా చేసుకొన్నారు మితవాద నాయకులు. కాంగ్రెస్‌లో నుండి అతివాదులను (వర్జుచేయటానికి) తొలిగించడానికి తీవ్రప్రయత్నాలు సాగుతాయి. అతివాదులు మునుపటికన్న ఎక్కువ పట్టుదలతో కాంగ్రెసు తీర్మానాలను ప్రజలకు తెలియజేయాలి. కాంగ్రెస్సు కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టించాలి. అప్పుడే అతివాదులమీద దాడిని ఆపుటకు ప్రజలంతా ముందుకు వస్తారు!

# లాలా హరదయాళ్ జీవితం

కామ్రేడ్ ఎ. సర్వేశ్వరరావు

1900 వ సంవత్సరం ప్రారంభంలో చాలామంది ఆసియాఖండ విద్యార్థులు యూరోపా విశ్వవిద్యాలయాల్లో చదివి, తిరిగి వారివారి దేశాలకు చేరేరు. వారితోపాటు యూరోపా నాగరికత, స్వాతంత్ర్యభావాలు, స్వేచ్ఛాభిలాష మొదలగునవి ఆసియాకు వచ్చాయి. ఆసియా విద్యార్థులకు తమ ప్రస్తుతస్థితి చాల హేయంగా, నీచంగా కనుపించింది. ఆసియాలోని తెల్లప్రభుత్వాలను ధ్వంసము చేయాలని నిర్ణయించుకొన్నారు. "ఆసియా ఆసియావాసులకే" యన్న నినాదం మారుమ్రోగింది. ఇంతలో పాశ్చాత్యదేశమైన రష్యా ప్రాచ్యదేశమైన జపాన్‌చే ఓడిపోయింది. ఇది, యీ వుద్యమానికి బ్రహ్మాండమైన బలం చేకూర్చింది.

1905 వ సంవత్సరం నాటికి భారతదేశం నూతన భావాలను, నూతన అభిప్రాయాలను స్వీకరించింది. నూతనశక్తి కలిగింది. దాస్యం యెంతమాత్రమైనా సహించలేకపోయింది. ఆంగ్లేయుల ఎత్తులను ప్రతిఘటించ మొదలు పెట్టింది. దీనికి పునాదిగా; బంగాళీ విభజనోద్యమము. ఇదంతా చాలామట్టుకు పాశ్చాత్యభావ సముద్రంలో మంచి యనుభవమును గడించిన గజ యీతగాళ్ళచే నడుపబడింది; గొప్ప రాజకీయ ఆందోళన సాగింది; భారత ప్రజావాహుళ్యం కొత్త వెలుతురులోకి రావటం మొదలిడినారు.

లాలా హరదయాళు ఢిల్లీనివాసి. కాయస్థ కుటుంబమునకు చెందినవాడు. తన చదువొక సామాన్య పాఠశాలలో ప్రారంభించాడు. తరువాత ఒక మిషనెరీస్కూల్లోచేరి స్కూలుఫైనల్ ప్యాసయినాడు. ఇది లాహోరుచేరేడు. ప్రభుత్వంవారి కాలేజీలో ప్రవేశించాడు. విద్యార్థివేతనం ఒకటి లభించాడు. 1903 లో యమ్. ఏ. పరీక్షలో యూనివర్సిటీకి ఫస్టువచ్చాడు. ఆ పరీక్షలో యాతని అభిమాన విషయము ఆంగ్ల సాహిత్యము. మరో సంవత్సరం చదివి చరిత్రలోకూడా యమ్. ఎ. డిగ్రీని పొందేడు. ఉన్నతవిద్యకై పాశ్చాత్య దేశాలకు పోవాలనే ప్రయత్నంలో వున్నాడు.

## సర్వ సమభావి

హరదయాళ్ సతీ సమేతంగా ఇంగ్లాండు చేరేడు. అతని యద్భుతమైన తెలివితేటల కబ్బురపడి భారత ప్రభుత్వం—ఏదవాడైనా సిఫారసు మందేషనులు లేకపోయినా అతనికి విద్యార్థివేతనం ప్రసాదించింది. ఆక్సుఫర్డు యూనివర్సిటీ వారొక స్కాలర్‌షిప్ యిచ్చారు. హరదయాళ్ సెంటుజాన్సు కాలేజీలో ప్రవేశించాడు. ఐ. సి. యస్. చదవటం ప్రారంభించాడు. అతనికి మత భేదాలులేవు. కుల భేదాలులేవు. కాపట్యం లేదు. అందరితో కలసి మెలసి హాయిగా తిరుగుచుండేవాడు. చాల కష్టమనిషి. అతనొక సర్వసమభావి (కాస్మాపాలిటన్.)

## పక్కా జాతీయవాది.

1905 లో హరిదయాళ్ ఆక్సుఫర్డులో ఐ. సి. యస్. చదువుచున్నాడు. అప్పుడే అతనికి జ్ఞాన నేత్రం తెరుచుకుంది; విప్లవ భావాలు రేకెత్తసాగేయి. ఆంగ్లేయులు హిందువుల నాగరికతను అంతం చేయుచున్నారని పసిగాడు. వారు ప్రవేశపెట్టిన విద్యావిధానం, హైందవ పద్ధతులను, సాంఘిక విజ్ఞానాన్ని, జాతీయ వ్యక్తిత్వాన్ని చంపివేసి, హిందూదేశస్థులను చిరస్థాయిగా దాసానుదాసులుగ వుంచటానికి సృష్టించబడినదిగా దృఢంగా నమ్మేటి బ్రిటిషు మ్యూజియమ్‌లోని పుస్తకాలన్నీ తిరిగవేయటం మొదలుపెట్టేడు. దాంట్లో పాతిన పాత రహస్యాలు విప్పలు విప్పలుగా రావటం మొదలిడినవి. చివరకు ఒకనిర్ణయానికి వచ్చాడు. బ్రిటిషువారి విద్యాలయములలో చదవటం, వారి వారి పరీక్ష పట్టములు గ్రహించటం, వారివలన సహాయం పొందటం, భారత సాంప్రదాయానికి విరుద్ధమని, అసహ్యమని, చంచలత్వమని తెలుసుకొని ఆ విధంగా చాటాడు, వెంటనే ప్రభుత్వం వారిచ్చిన విద్యార్థి వేతనం, యూనివర్సిటీవారిచ్చిన విద్యార్థి వేతనం నిరాకరించాడు. తాను దారిద్ర్యంతో బాధపడుతూకూడా; అతని అద్భుతమైన తెలివికి, సాటిలేని పాండిత్యానికి కాలేజీ ప్రొఫెసర్లందరు నివ్వెరపడి చదువయినాసాగించమని బ్రతిమిలాడారు. కాని వారి ప్రయత్నాలు వ్యర్థ మయ్యాయి.

## దేశ దిమ్మరి.

1907 లో హరదయాళ్ లండనువిడచిభారతదేశం చేరేడు. తన భావాలను ప్రచారం చేయటానికి వొకరకమైన రాజకీయ సన్యాసుల మతం స్థాపించాడు, పంజాబ్‌లో; అతని బోధ చాల మంది యువకులను ఆకర్షించింది. అతని బోధలు బ్రిటిషువారిని ఏదో విధాన భారతదేశాన్నుండి తరిమివేయాలనియే. అతడు తన కార్యక్రమమునును ఆచరణలో పెట్టుటకు విద్యార్థులను పాఠశాలలను వదలివేయ మన్నాడు. లాయర్లను కోర్టులను వదలివేయ మన్నాడు. ఉద్యోగస్థులను ఉద్యోగాలకు స్వస్తి చెప్పమన్నాడు అందరూ పవిత్ర జీవితం గడపాలనినియమం ఈ విషయాలపై హరదయాళ్ అనేకమందితో చర్చించాడు; వాదించాడు; బోధించాడు పత్రికలకు వ్యాసాలు ఘాటుగా వ్రాశాడు. అవి భారతీయులనే కాకుండా, భారతప్రభుత్వాన్ని కూడా ఆకర్షించాయి. అతని వ్రాతలను ప్రభుత్వం నిషేధించింది; అరెస్టుచేసే ప్రయత్నంలోవుంది. భారతీయులలో అలజడి ప్రారంభమైంది. ఈ విషయం హరదయాళ్ చెవులబడింది. వెంటనే 1908 తొలి రోజులలో పాశ్చాత్య దేశాలకు పునాయించాడు. నేటివరకూ రాలేదు; యికరాడు; భారతదేశం అతణ్ణి కోల్పోయింది. ప్రభుత్వ నిరంకుశత్వానికి అతడు బలిఅయ్యాడు!

హరదయాళ్ ఐరోపా చేరేడు. ఒకదేశంలో స్థిరంగా లేడు. అనేకచోట్లకు తిరిగాడు. అనేక మందిని కలుసుకొన్నాడు అనేక ప్లానులు వేశాడు. తన తత్వాన్ని అవిచ్ఛిన్నంగా ప్రచారం చేసుకోటానికి సానుకూలమైన దేశంకోసం తహతహలాడేడు. చివరకు ఫ్రాన్సు చేరేడు.

హరదయాళ్ ఫ్రాన్సులో వొక సంవత్సరం స్థిరంగా వున్నాడు. అతడా రోజుల్లో ఫ్రెంచి, జర్మన్ భాషలు నేర్చుకున్నాడు. రెంటిలోకూడ వుత్తమమైన వ్యాసాలువ్రాయగలడు. మహోపన్యాసాలు చేయగలడు. ఆరోజుల్లో వుత్తమ రాజనీతిజ్ఞులతో పరిచయం చేసుకొన్నాడు. ఈజిప్టు జాతీయవాదులలో అతనికి సఖ్యం కుదిరింది. రష్యా విప్లవకారులలతో స్నేహం కలిగింది. కొలది రోజుల తరువాత అల్జీరియా చేరేడు. అక్కడ వాతావరణం బాగుండలేదు; కాబట్టి ఆదేశాన్ని వదిలివేశాడు.

## బౌద్ధుడు.

హరదయాళ్ వెస్టిండియా దీవులలో మార్టినిక్యూవద్ద నివసిస్తున్నాడు. వైరాగ్యం అవలంబించాడు. నిర్జన ప్రాంతాల్లో, కొండ లోయల్లో, చీకటి గుహల్లో, నివసిస్తుండేవాడు. తాను ప్రబలమైన దారిద్ర్యంతో బాధపడుచున్నా, భారతీయుణ్ణి చూస్తే ప్రాణం లేచి వచ్చేది; ఎక్కడ కనుపించినా అతిధిగా తీసుకొనివెళ్ళి సత్కరించేవాడు. స్నేహితుల సామానుకూడ యింటికి మోసకుపోయేవాడు. ఆ రోజులలో అధ్యాత్మిక జీవనం గడుపేవాడు. కటిక నేలపై పరుండేవాడు. బంగాళా దుంపలే ఆహారం. రోజంతయు గ్రంథపఠనంలో, ధ్యానములో గడపేవాడు. ఒకసారి మిత్రుడు అతని విషయం అడుగగా, "నేను ప్రపంచానికి బుద్ధునివలె నూతన తత్వాన్ని ప్రసాదిస్తా; దానికొరకే యీ కఠిన శిక్షణ; యీ నిర్జన ప్రాంతాల్లో, గుహల్లో తీవ్రాలోచనా మగ్నుడనవటం" అని జవాబిచ్చేడు. కొన్ని దినాలు గతించాయి, ఆ ప్రదేశం వదలివేశాడు.

హరదయాళ్ హనలూలూ ద్వీపంచేరాడు. అది పసిఫిక్ మహాసముద్రంలో వుంది. అతడు భారత స్వాతంత్ర్యం కొరకు కలలుగంటూ వున్నాడు. స్వాతంత్ర్యపు జెండా ఎప్పుడు ఎత్తుదునా యని ఆతురతతోవున్నాడు. తన వుద్యమాన్ని తీవ్రంగా నడపాలని సంకల్పించుకొన్నాడు. ఉద్యమోద్ధరణకు ఏపనియైనా చేయ నిర్ణయించుకొన్నాడు చాల నీతిపరుడు. స్వార్థరహితుడు. వేదాంతి. శూన్యవాది.

## బ్రిటీష్‌వారిపై ద్వేషం.

కాలము మారిపోతూంది. హరదయాళ్ భావాలుకూడా నానాటికి తీవ్రత చెందుచున్నాయి. రోజురోజూ బ్రిటిషువారిపై ద్వేషం పెరుగుతూంది. బ్రిటిషువారు దౌర్జన్యంతో, మోసంతో, భారతదేశంలో రాజ్యం చేయుచున్నారని, వారి న్యాయసంస్థలు మనకు అనవసరమని చాట మొదలిడినాడు. బ్రిటిషు ప్రభుత్వంపై విప్లవం లేవదీయ దలచాడు. భారతదేశంలో అమెరికాలో, బర్మాలో, చైనాలో — భారతీయులు ఎక్కడవుంటే అక్కడ ప్రభుత్వానికి ప్రతికూలమైన రహస్య సంఘములను స్థాపించాడు. తనకు కావలసిన సొమ్ము బ్రిటిషు ప్రభుత్వం వద్దనుండి "బహుమతి"గా పుచ్చుకోదలచాడు. తన సంఘాధ్యక్షులకు అన్ని విషయాల్లో పూర్తి అధికారాలు యిచ్చాడు.

హరదయాళ్ దృష్టి విశాలమైంది. క్రొత్త క్రొత్త భావాలను స్వీకరించాడు. సామ్యవాదము అతన్ని ఆకర్షించింది....వస్తు వుత్పత్తి సాధనాలన్నీ ఏవిధంగా ధనమదాంధులు తమచేతుల్లో వుంచుకొని తైతక్కలాడుచున్నారో, స్వప్రయోజనాల సమస్య ముందుకు ఎలావస్తూందో, సామాన్య ప్రజలు ఎలా అవస్థ పడుచున్నారో, అర్థం చేసుకొన్నాడు. రేయింబవళ్లు చెమటోడ్చి పనిచేసే ప్రజలు ఏవిధంగా సామ్రాజ్యవాదుల యినుపచేతుల్లో నలిగిపోతున్నారో, బాధలో గర్వ దరిద్రులుగ ఎట్లు మూల్గుచున్నారో ప్రభుత్వాలు ధనాధికులకు ఎట్లు సాయపడుచున్నాయో, కష్టజీవికి ఎలా అన్యాయం జరుగుతుందో, అందరూ సుఖపడాలంటే ప్రభుత్వం ఎవరి చేతుల్లో వుండాలో, గ్రహించాడు.

అప్పటి విద్యాధికులలో అరాజకవాదము కొంతవరకు స్థానం సంపాదించింది. ప్రభుత్వమనేదే అసలుండకూడదని వారివాదన. మానవుడు స్వేచ్ఛా ప్రవృత్తితో సామరస్యముగ జీవించగలడు. అన్ని సంస్థలు, సంఘాలు తమలో తాము స్వేచ్ఛగా ఏర్పరచుకొన్న కట్టుబాట్లు ప్రకారం నడుస్తాయి. చట్టాలు వుండకూడదు. అధికార దుర్వాసన తగలకూడదు. సంఘాలమధ్య, వ్యక్తులమధ్య జరిగే వ్యవహారాలు, లావాదేవీలు భయభక్తులు లేకుండా జరగాలి .... ఇటువంటి భావాలతో యాతని హృదయం కూడా నిండి వుండేది ....

## అమెరికాలో విప్లవ ప్రచారము.

తరువాత హరదయాళ్ అమెరికా చేరేడు. హార్‌వర్డులో, బర్కలీలో, స్టాన్ ఫోర్డులో వేదాంతంపై మహోపన్యాసాలు కావించాడు. వాక్చాతుర్యంలో అతని అసమాన కౌశలం అతని గంభీర భావాలు అమెరికా వాసులను ఆశ్చర్య చకితులుగా చేసేయి. అనేకచోట్లనుండి ఆహ్వానాలు వచ్చాయి. చాలాచోట్ల ఉపన్యసించాడు, చివరకు స్టాన్‌ఫోర్డు యూనివర్సిటీవారు తమ కాలేజీలో సంస్కృతానికి, వేదాంతానికీ ఆచార్యునిగా కోరేరు; దానికి అంగీకరించాడు తనకు విజ్ఞాన ప్రచారమే ప్రధానమని జీతంకూడా పుచ్చుకోలేదు; వచ్చిన చెక్కులన్నీ త్రిప్పివేశాడు. తన సామ్యవాద భావాలను, అరాజక భావాలను, అమెరికా విద్యార్థులకు బహిరంగంగా, ప్రత్యక్షంగా బోధింప మొదలెట్టేడు. అవి చాలామందిని ఆకర్షించాయి. కాని అమెరికా ప్రభుత్వానికి నచ్చలేదు. ఆ ప్రభుత్వ విధానాన్ని హరదయాళ్ నిర్భయంగా విమర్శించేవాడు. అతని పోకడలు చూచి యూనివర్సిటీ వారు చాల భయపెట్టేరు; బోధనలు తీవ్రతలు తగ్గించమని ప్రార్థించారు. హరదయాళ్ లాంటి విజ్ఞానరాశిని ఎవరు కోల్పోవుటకు యిష్టపడతారు? కాని హరదయాళ్ తన పదవికి రాజీనామా యిచ్చేశాడు. అతడు స్వాతంత్ర్య ప్రియుడు!

1911 లో హరదయాళ్ కాలిఫోర్నియా చేరేడు. సేన్‌ఫ్రాన్సిస్కోలో నివాసం ఏర్పరచుకొన్నాడు. తన ప్రచారం జోరుగా సాగించ మొదలుపెట్టేడు. అమెరికాలోని ధనాఢ్యులను, మహాభోగులను చూస్తే అతని కసపు మంట. హరదయాళ్ విశ్వమానవ కళ్యాణం కోరేవాడు. జగత్సేవకుడు గనుక, అమెరికావాసుల జీవితం అతనికి నచ్చలేదు. కాని ప్రచారం మాత్రం నిరాఘాటంగా సాగుతూంది. పైగా ఒక ముద్రణాలయం స్థాపించాడు. "గదర్" (తిరుగుబాటు) పత్రికనుస్థాపించాడు. దానిలోని వార్తలు వ్యాసాలు అతి ఘాటుగా వుండేవి; నిరంకుశ ప్రభుత్వాలపై నిప్పులు గ్రక్కుతూ ఉండేవి; దానికి తోడు 1913 లో భారతవీరుల బొమ్మలు శాక్రమెంటోలు ప్రదర్శించి, భారతీయుల విప్లవోద్యమానికి గొప్ప ప్రచారం చేసేడు. ప్రపంచ సంగ్రామం రేపా, మాపా, అన్నరోజులు అవి. ఇక అమెరికా, ఇంగ్లండు ప్రభుత్వాలు భరించలేకపోయాయి. దానికి ఫలితంగా అరెస్టు చేయబడ్డాడు. వెంటనే జామీనుపై వదలినారు. కాని తరువాత స్విట్జరులాండుకు పారిపోయాడు.

## ప్రపంచ యుద్ధం.

హరదయాళ్ స్విట్జరులాండులో వుండి తన ప్రచారాన్ని ద్విగుణీకృతం చేశాడు. అప్పటికే ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. ఈతని ప్రచారచక్యం ప్రతిభచూచి జర్మను ప్రభుత్వం తన విదేశాంగ కార్యాలయానికి గొప్ప గౌరవంతో ఆహ్వానించి ఒక ఒడంబడిక చేసికొంది. ఏమని? జర్మనీ గెలిస్తే భారత స్వాతంత్ర్యం స్థిరమని! వెంటనే హరదయాళ్ తన మిత్రులు స్థాపించిన విప్లవ సంఘాల సభ్యులందరిని హిందూదేశానికి వెళ్ళి యుద్ధానికి తయారవమని ఆజ్ఞాపించాడు. తాను యుద్ధసామగ్రిని పంపుతానన్నాడు. కొమగటమారు(ఓడ)లోనిప్రయాణికులు హరదయాళ్‌పక్షంవారే.... హెన్రీ.... మెవరిక్‌లు ....మొదలైన యుద్ధ సామగ్రి వోడలు-భారతీయులతో బడ్జిబడ్జి చేరేయి. బడ్జిబడ్జి వద్ద ప్రారంభమయింది. భారత విప్లవ తుఫాన్. బ్రిటిషు ప్రభుత్వం కొందరిని బలవంతంగా రైల్లో ఎక్కించి తీసుకపోయారు. కొందర్ని ఇంటర్ను చేశారు. కొందరకు జైలువాసం; కొందరు మృత్యువాత బడ్డారు. తరువాత మరో స్టీమరు సేన్‌సిడ్రా కాలిఫోర్నియా, భారతదేశం రాబోతూ, దారిలో సోదాచేయబడి వెనుకకు మరలింది. మరో చిన్నవోడ (S. హెన్రీ) భారతదేశం రావలసింది షాంగ్‌హైచేరింది. ఇలా అనేక యుద్ధసామగ్రివోడలు భారతీయుల కొరకు వచ్చాయి. వాటిఫలితం? భారతీయులకు చైనావారికి, జర్మనులకు, ఉరిశిక్షలు, దీర్ఘ కారాగృహ శిక్షలు, యింటర్నుమెంట్లు.

హరదయాళ్ ప్రయత్నాలు వ్యర్థమయాయి. ప్లానులు పాడయాయి. భారత విప్లవకారుల శక్తులడుగంటినాయి. ప్రపంచయుద్ధంలో జర్మనీ వోడింది.

ప్రపంచ మహాయుద్ధం ముగిసింది. అప్పటినుండి హరదయాళ్ పూర్తిగా మారిపోయాడు. రాజకీయాలనుండి చాలమట్టుకు విరమించాడు. మరల ఏకాంతవాసం, పర్వతప్రాంతాల్లో విహరించటం మొదలుపెట్టాడు. అప్పటి మకాం స్వీడనుదేశం.

హరదయాళ్ గొప్పప్రతిభావంతుడు. మేధావి. వివిధ భాషలలో పరిజ్ఞాత. సుప్రసిద్ధ గ్రంథకర్త. పేరెన్నికగన్న జర్నలిస్టు. గొప్ప వుపన్యాసకుడు. రాజనీతిజ్ఞుడు. సమయోచిత కార్యనిర్వాహణ చాతుర్యంకలవాడు. ప్రఖ్యాత విప్లవకారి. సరళజీవి. పవిత్రశీలం కలవాడు. అసమాన ధైర్యశాలి. మంచి యుక్తిపరుడు. నిష్కపట స్వభావి. నిర్మొగమాటం గలవ్యక్తి.

హరదయాళ్ లండనుచేరాడు. అతనిభావాలు పూర్తిగా మారిపోయాయి. మొన్నటివరకు సైన్సులలో, చరిత్రలలో, సాంఘిక విషయాల్లో పరిశోధనలు లండను యూనివర్సిటీలో చేస్తూ వుండేవాడు. యీమధ్యనే ఆ యూనివర్సిటీవారు "డాక్టరేట్"బిరుదమును యిచ్చిరి. అంతర్జాతీయ వేదాంత సంఘంలోను, అంతర్జాతీయ శాంతి సమితిలోను పనిచేస్తూ వుండేవాడు. అతని సందేశం ప్రపంచాన్నంతా డెమొక్రసీ, లిబర్టీ, సైన్సు, రేషనల్ ఎతిక్సుద్వారా రాజకీయంగా, వైజ్ఞానికంగా, సాంఘికంగా, భ్రాతృత్వముపై ఏకంచేయుట ఇదొక వింత సందేశము; వింత వుద్దేశం.

హరదయాళ్ వ్రాసిన గ్రంథాలలో అమూల్యమైనవి The Bodhisatva Doctrine in Sanskrit Literature. (2) Hints for self-culture (3) Twelve Religions and modern Life. అమెరికా, యింగ్లాండు, యిండియాలలో సుప్రసిద్ధ పత్రికలలో ఇతడు వ్యాసాలువ్రాస్తూ వుండేవాడు. ఈతణ్ణి "భారత మెకాలే" అంటూ వుండేవారు. అతనికి సంస్కృతం, వుర్దూ, హిందీ, ఇంగ్లీషు పెరిషియన్, ఫ్రెంచి, జర్మను, స్వీడన్ భాషలు పూర్తిగావచ్చు. చనిపోయే టప్పటికి గ్రీక్, ఎస్‌పెరాంటో భాషలు నేర్చుకుంటూ వున్నాడు! గోఖ్లే, లజపతిరాయ్, సర్‌సప్రూ, ఆండ్రూస్, (లండను) ఆస్థానకవి బ్రిడ్జిస్, సర్‌ఫ్రాన్సిస్‌యంగ్ హస్బెండ్ (అమెరికా) ప్రిమెంట్ ఓల్డరు, జాన్‌డారీ, యు. పోప్, డారో యింకా గోడెన్‌బర్గు యూనివర్సిటీ ప్రొఫెసర్లకు హరదయాళ్ అంటే గొప్ప అభిప్రాయము. అతనిలో వున్న శక్తికి అబ్బురపడుచుండేవారు.

హరదయాళ్ క్రితం అక్టోబరు అమెరికా చేరేడు. Fifth world Parliament of Religions of the world Felowship of Faiths—ని ఆర్గనైజ్ చేయటానికివెళ్ళాడు. శక్తి వంచనలేకుండా పని చేస్తున్నాడు. కాని మార్చి నాల్గవనాడు ప్రశాంతంగా, ప్రశాంతి సమయంలో మహాశాంతిని పొందేడు-ప్రకృతి ఒడిలో.





కలకత్తా

# ఎ. ఐ. సి. సి. తీర్మానాలు

## యుద్ధభయము

ఈ తీర్మానము సుభాస్‌బోసుచే వ్రాయబడింది. నెహ్రూ దీనిని ప్రతిపాదించాడు. మిగతా మూడు తీర్మానాలు రాజేంద్రప్రసాద్ అధ్యక్షస్థానాన్నుండి ప్రతిపాదించాడు.

"అంతర్జాతీయ యుద్ధభయం ఎక్కువ అవుతూండడంవలన, ఇంతవరకు కాంగ్రెసు పదేపదే ప్రకటించుతూ వచ్చిన యుద్ధ ప్రతికూల విధానాన్ని గురించి దేశానికీ, కాంగ్రెసుయొక్క ఈ విధానంతో సంబంధం వున్నవారందరికీ, ఈ సమావేశము (ఎ. ఐ. సి. సి.) మరొకసారి జ్ఞాపకం చేస్తూవుంది. ఈ విధానాన్ని పూర్తిగా అమలుజరుపుతూ, భారతదేశం మీదకి యుద్ధాన్ని తెచ్చిపెట్టి, భారతీయ ప్రజల అనుమతి లేకుండా భారతీయ సాధన సంపత్తిని యుద్ధం నిమిత్తము వినియోగించే ప్రయత్నాలనన్నిటిని ఎదుర్కోడానికి కాంగ్రెసు నిశ్చయించింది.



"ఈడెన్‌కు భారతీయ సైనిక దళాన్ని పంపడం కేవలం బ్రిటిషు సామ్రాజ్యవాదులు స్వప్రయోజనాలకు భారతీయులను ఉపయోగించుకొనడమేగాన ఈ చర్యను ఈ కమిటీ నిరశిస్తూవుంది.

"ముఖ్యంగా యుద్ధ సమయంలో బ్రిటిషు సామ్రాజ్యవాదానికి ఏజంటుగా పనిచేసే సెంట్రల్ గవర్నమెంటు చేతులలో అధికారాన్నంతటినీ కేంద్రీకరింపజేయడానికి, ఇండియా చట్టములో బ్రిటిషు ప్రభుత్వం చేస్తూన్న మార్పులను ఈ కమిటీవారు నిరశిస్తున్నారు. కాంగ్రెసుకు ఇండియా చట్టములో చేసేమార్పులు ఇష్టంలేదు. సరికదా అసలు చట్టాన్నే భగ్నం గావించడానికి పనిచేస్తూ వుంది. అటువంటప్పుడు రాష్ట్రీయ స్వపరిపాలనా సూత్రాన్నే పరిహాసాస్పదం చేస్తూ, యుద్ధం వచ్చినప్పుడు ఇండియాలో సెంట్రల్ గవర్నమెంటుకు యుద్ధపు నియంతృత్వమిచ్చి రాష్ట్రప్రభుత్వాలను సామ్రాజ్యవాదాన్ని బలపరచే అసహాయ ప్రతినిధులను గావించే ఇట్టి సవరణను అసలే సహించదు ఇటువంటి సవరణను బలవంతంగా మెడకుచుట్టే ప్రయత్నము దేనినైననుసరే కాంగ్రెసు తనకు వీలైన అన్ని పద్ధతుల ద్వారా ఎదిరించాలి. ఎదిరింతీరుతుంది కూడాను.

"ఈ విషయమై అఖిలభారత కాంగ్రెసు కమిటీ గాని, వర్కింగు కమిటీగాని నిర్ణయించిన విధానాన్ని అమలు జరపడానికి సంసిద్ధముగా నుండవలెనని రాష్ట్ర ప్రభుత్వాలను హెచ్చరించడమైనది."

## రాజకీయ ఖైదీలు

"బెంగాలులోని రాజకీయ ఖైదీల విడుదల కోసం మహాత్మా గాంధి చేసిన తీవ్ర కృషికి ఈ కమిటీవా రభినందించుచు, ఈ సందర్భంలో గాంధిగారికిని హక్ మంత్రివర్గమువారికిని మధ్య జరిగిన రాయబారము లన్ని విఫలమైనందుకు విచారించుచున్నారు. ఈ రాజకీయ ఖైదీలకు విడుదల చేకూర్చవచ్చునని మహాత్ము డానించిన కాలము మీరిపోయినది. ఈ సమయములో బెంగాలు మంత్రివర్గమువా రవలంబించిన పెడసరపు, మొరటు విధానమువలన దీర్ఘ ప్రవాస శిక్ష విధింపబడిన ఖైదీల విడుదల లాభము లేనిదైనది."

"ఈ కమిటీ అభిప్రాయంప్రకారం ఎప్పుడో ఎమర్జెన్సీ సమయంలో ప్రత్యేకాధికారాల క్రింద శిక్షించబడిన వారిని, ముఖ్యంగా ఖైదీలు టెర్రరిజంలో తమకు నమ్మకము పోయినదని బహిరంగ ప్రకటన గావించినప్పుడు వారి నింకను బంధించి వుంచవలసిన అగత్యం లేదు. అందుచేత బెంగాలు, పంజాబులలోని రాజకీయఖైదీల విడుదల నొక అఖిలభారత సమస్యగా చేసి, వారి విడుదల కొరకు ఉద్యమము నెట్లు సాగించాలో నిర్ణయించవలసినదిగా వర్కింగు కమిటీని ఈ కమిటీవారు కోరుచున్నారు."

## కెన్యా సమస్య

"కెన్యా పీఠభూములను ఐరోపాదేశస్థులకు ప్రత్యేకించుచూ కౌన్సిలులో ప్రకటించిన ఉత్తరువును ఈ కమిటీవారు ఉపేక్షింపరానిదిగా భావిస్తున్నారు. ఈ ప్రకటన ఇదివరలో వలస రాజ్యాల కార్యదర్శి చేస్తూవచ్చిన వాగ్దానాలను ప్రకటనలను ఉల్లఘించటమే కాకుండా జాతి భేదాలను తెచ్చిపెట్టేదిగాను భారతీయులను అవమాన పరచేదిగాను ఉంది.

"ఈ విషయంలో, ఇండియా గవర్నమెంటు కెన్యాలోని భారతీయుల యెడల తన కర్తవ్యాన్ని నెరవేర్చలేకపోయిందని కూడ ఈ కమిటీయొక్క అభిప్రాయమై యున్నది.

"అంతేకాదు, కెన్యాలోని పరిస్థితులను ఇండియా ప్రభుత్వము చక్కబెట్టలేదు గావున ఈ కమిటీవారు కాంగ్రెసు వర్కింగుకమిటీనే తగినచర్య తీసుకొనవలసినదిగా కోరుచున్నారు."

## శుద్ధి సంఘం

"త్రిపురీ కాంగ్రెసులో, కాంగ్రెసును సంస్కరించాలని చేసిన తీర్మానం ప్రకారం కాంగ్రెసును శుద్ధి చేయడానికి ఈ క్రిందివారిని ఉప సంఘముగా ఈ కమిటీ నియమించుచున్నది. (1) రాజేంద్ర ప్రసాద్, (2) జవహర్లాల్ నెహ్రూ, (3) డా॥ పట్టాభి, (4) ఆచార్య నరేంద్రదేవ్, (5) ఆచార్య కృపలాని.

# సుభాషుబాబుగారి 'ఫార్వర్డు బ్లాకు'

## "అతివాదుల నందరినీ ఒక వేదికపైకి తీసుకురావాలి"

కాంగ్రెసు అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చిన సుభాష్‌చంద్రబోసు యీక్రింది ప్రకటన గావించుచున్నాడు.

"1937లో నేను కారాగారమునుండి విడుదల అవగానే, ఆసంవత్సరము అక్టోబరులో కలకత్తాలో జరిగిన అ.భా.కాం. కమిటీ సమావేశమునకు వెళ్లితిని. తదువాత, 1938 ఫిబ్రవరిలో హరిపురాలో జరిగిన అ. భా. కాం. కమిటీసభకు వెళ్లియుంటిని. అక్కడ అతివాదులు గతసంవత్సరము కంటె బలపడుటకు మారు బలహీనులై యున్నట్లు నేను చూచితిని. హరిపురా కాంగ్రెసు ముగిసిన తర్వాత నేను వేర్వేరు దృక్పథములుగల అతివాదులతో సంప్రతించినప్పుడు వారు అంతవరకూ అవలంబించినట్టి విధానములోను, కార్యక్రమం లోను, ఏదో లోపించియున్న విషయం ఒకటి ఉండడంవల్లనే అలాజరిగిందని నేను తెలియజేసి ఉంటిని.

### కాంగ్రెసులో వివిధ పార్టీలు

అప్పుడు కాంగ్రెసులో సభ్యులుగా ఉన్నవారు ప్రధానముగా యీక్రింది పార్టీలకు, ముఠాలకు, చెందియుండేవారు. ఒకవైపున, సర్దారు పటేలు - బాబురాజేంద్రప్రసాదు, మౌలానా అబ్దుల్‌కలాం అజాదు మొదలైనవారి నాయకత్వంలో ఉన్న అధికారపక్షం ఉంది. అతివాదులలో మూడు ముఠాలవారు స్పష్టంగా కనుపించారు. ఒక్కొక్క ముఠాయొక్క సంఖ్యాబలముకూడా వేర్వేరుగా ఉండేది. వారే. కాంగ్రెస్ సోషలిస్టులు - అల్ట్రాలెఫ్టిస్టులు, రాయి అనుచరులు. వీరుగాక, సంఘటన శక్తిలేని సామ్రాజ్యవ్యతిరేకులు అనేకమంది అతివాదులుగా ఉన్నారు. వీరు అధికార పక్షంలోనూ చేరరు. వారివారికి గల కారణాలకొద్దీ అతివాద పార్టీలలోగాని, ముఠాలలోగాని, చేరరు. అతివాదులుగా ఉన్న యీ సామ్రాజ్య వ్యతిరేకులందర్నీ సంఘటిత పరచి ఒక వేదిక మీదికి తీసుకువస్తేగాని అతివాదుల ఉద్యమం అభివృద్ధి చెందదనీ, తగినంత బలాన్ని సంపాదించుకొన జాలదనీ, నేను అభిప్రాయపడ్డాను.

### కొత్త 'బ్లాకు' యొక్క ఆవశ్యకత

అందువల్ల కాంగ్రెసులో ఒక కొత్త బ్లాకును ఏర్పరచడం అవసరమనీ, ఒక కనీస కార్యక్రమము దానికి ఉండాలనీ, అట్టిబ్లాకు "లెఫ్టుబ్లాకు" (అతివాదులసంస్థ) అని పిలువబడాలనీ, సూచించబడింది. ఇప్పుడు పనిచేస్తూన్న అతివాదపార్టీలన్నీ దానిలో చేరడానికి స్వతంత్రము కలిగియుంటాయి. ఏసంఘంలోను చేరని అతివాద సామ్రాజ్యవ్యతిరేకులు కూడా ఆ "బ్లాకు"లో చేరవలసిందని ఆహ్వానించబడుతారు. ఇప్పుడు పనిచేసే అతివాదపార్టీల నాయకులలో చాలామందిచే యీసూచన అంగీకరించ బడింది. వారే యీపనిని నెరవేరుస్తారని కూడా అప్పుడు ఊహించబడింది. 1938 సెప్టెంబరులో ఢిల్లీలో జరిగిన అ భా. కాం. కమిటీ సమావేశము జరిగినప్పుడు మరొక అడుగు ముందుకు వేశారు. ఒక అల్ట్రాలెఫ్టిస్టు నాయకునిచే ప్రణాళికకూడా ఒకటి తయారు చేయబడింది. ఒక కాంగ్రెస్ సోషలిస్టు నాయకుడు దీనికి కొన్ని సవరణలు చేశాడు. తరువాత దాన్ని కొద్దిమంది కాంగ్రెసు వాదులకు పంపి, వారి అభిప్రాయాలు తెలియ జేయవలసిందిగా కోరబడ్డారు.

### సోషలిస్టుల వైఖరి

తరువాత సోషలిస్టుల అభిప్రాయాలు మారటం తటస్థించింది. "లెఫ్టుబ్లాకు"ను ఏర్పరచడానికి తమ తమ వ్యతిరేకతను తెలియజేస్తూ కొంతమంది ప్రముఖ సోషలిస్టు నాయకులు బహిరంగంగా ప్రకటించారు. ఈవిధంగా వారు తమ అభిప్రాయాన్ని మార్చుకొనడం వల్ల యితర అతివాద పార్టీల వారెవరూ ముందుకు రాలేదు.

అనేకమంది కాంగ్రెసు వాదులు మాత్రం యిందుకు తీవ్ర ప్రయత్నాలు సాగిస్తూనే ఉన్నారు. 29-1-1939 నాటి కాంగ్రెసు అధ్యక్ష ఎన్నిక తరువాత ఫిబ్రవరి మొదటివారంలో అతివాద కాంగ్రెసువాదుల యిష్టాగోష్ఠి సభ ఒకటి కలకత్తాలో జరిగింది. "లెఫ్టుబ్లాకు"ను గురించి తిరిగి చర్చలు జరిగాయి. కాని, కొందరు ప్రధాన సోషలిస్టు నాయకులు అంగీకరించ లేదు. ఈ పరిస్థితులలో, యిప్పుడున్న అతివాద ముఠాగాని, ముఠాలుగాని, "లెఫ్టుబ్లాకు"ను స్థాపించడంలో ముందంజ వేస్తారనే ఆశ వదలుకోవలసి వచ్చింది.

కాని, దీనికి అనుకూలురు మాత్రం పట్టుదలను విడిచి పెట్టలేదు. మార్చి 1939 లో త్రిపురీలో మరొక యిష్టాగోష్ఠి సమావేశం జరిగింది. అక్కడ యీవిషయంపై తిరిగి చర్చ జరిగింది. కొందరు ప్రధాన సోషలిస్టు నాయకులు అంగీకరించ నందున, "లెఫ్టుబ్లాకు"ను బదులుగా మరొక పేరుతో స్థాపించవలసిందని కొందరు సూచించారు. సంస్థయొక్క కార్యక్రమము కూడా ఒకటి వ్రాసి దాన్ని తాత్కాలికంగా అంగీకరించడం జరిగింది. వచ్చే అ. భా. కాం. కమిటీ సమావేశమయినప్పుడు తుది నిర్ణయానికి రావచ్చునని అక్కడ నిశ్చయించు కొన్నాము.

సామ్రాజ్యవ్యతిరేకులై, అభివృద్ధిని కాంక్షించే అతివాదు లందరినీ ఒకచోట సంఘటిత మొనర్చడానికి కాంగ్రెసులో ఒక "బ్లాకు" ను స్థాపించుటకు ఆలస్యం ఏమాత్రమూ పనికిరాదనీ; అట్టి సంస్థయొక్క కార్యక్రమము వేర్వేరు భావాలుగల అతివాదులలో యెక్కువ అంగీకారాన్ని పొందిన కనీస కార్యక్రమముగా ఉండాలనీ, ఏకగ్రీవముగా నిర్ణయించబడింది.

### ఇదొక పార్టీకాదు; వేదికమాత్రమే

ఈ కొత్తసంస్థకు "లెఫ్టుబ్లాకు" అనేపేరు మానివేసి. ఫార్వర్డు బ్లాకు అనేపేరు పెట్టవలసిందని కూడా ఆసమావేశంలో నిర్ణయించ బడింది. ఈ "ఫార్వర్డు బ్లాకు" సాధారణంగా అందరూ అనుకొనేటట్లు ఒక పార్టీకాదు. దీని కార్యక్రమాన్ని అంగీకరించిన వారందరినీ ఐక్యమొనర్చే ఒకవేదిక మాత్రమే. సంఘటితముకాని అతివాద కాంగ్రెసుసభ్యులే కాకుండా, యిప్పుడు పనిచేసే అతివాద పార్టీలుకూడా యీ "బ్లాకు" లో చేరవలసిందని ఆహ్వానిస్తున్నాను. కాంగ్రెసులో ఉన్న అన్ని అతివాదవ్యక్తులు, సోషలిస్టు శక్తులు, పార్టీలు, కొద్ది కాలంలోనే "ఫార్వర్డుబ్లాకు" లో చేరగలవని ఆశించ బడుతోంది.

కాంగ్రెసు అధికార పదవులలో ఉన్న నాయకులకు గాంధీసేవాసంఘం సంఘటితమైన ఒక పునాదిగ ఉంది. అధికారేతర సభ్యులందరికీ అట్టి సంఘటన సంస్థ ఏదీ ఇంతవరకూ ఏమీలేదనే చెప్పాలి. "ఫార్వర్డుబ్లాకు" పూర్తిగా అభివృద్ధి చెందినప్పుడు కాంగ్రెసులో ఉన్న అధికారేతర సభ్యులకు, అతివాదులకు, సోషలిస్టులకు, అదొక పునాది సంస్థగా ఉపయోగపడుతుంది. అప్పుడే కాంగ్రెసులో ఉన్న అతివాదులకు తగినంత బలం ఏర్పడుతుంది

కాంగ్రెసులో ఒక భాగంగానే యిది పనిచేస్తుంది, కాంగ్రెసు నియమావళిని, సూత్రాన్ని, విధానాన్ని, కార్యక్రమాన్ని, పూర్తిగా అంగీకరిస్తుంది. గాంధీ మహాత్మునికి ఈయవలసిన గౌరవాన్ని యిస్తుంది. అతడు ప్రసాదించిన అహింసాయుత సహాయనిరాకరణము అనే రాజకీయాస్త్రంలో సంపూర్ణమైన విశ్వాసం ఉంచి పనిచేస్తుంది. కాని, దీని అర్థము యిప్పుడు అధికారములో ఉన్న నాయకులమీద విశ్వాసం ఉంచి తీరాలి అనికాదు.

### ఈ క్లిష్టస్థితిని ఇప్పుడే ఎదుర్కొంటే మేలు

"ఫార్వర్డుబ్లాకు"ను స్థాపించడముద్వారా కాంగ్రెసులో యిప్పుడు ఎందుకు యీ క్లిష్టస్థితిని కలుగజేస్తున్నాము అని కొందరడుగ వచ్చును. నేటి కాంగ్రెసు నాయకత్వము ఏదో ఒక రాజీ పంధాను అనుసరించాలనిగాని, పరిస్థితులతోబాటు నడవాలనిగాని, ఊహిస్తూన్నట్లుకానరానందున, ఈవేళకాకపోయినా రేపు కాంగ్రెసులో క్లిష్టస్థితి యేర్పడక తప్పదని నా అభిప్రాయము. వారికి మనము పూర్తిగా లోబడిపోతే, యీక్లిష్టదశ రాకుండా నేడు తప్పించు కొనగలము కాని, దాన్ని వాయిదా వేయడమువల్ల మనకు కలిగే ప్రయోజనము ఏమిటి? దుర్దినాన్ని రేపటిదాకా కప్పి యుంచడము ఎందుకు? బయటనుంచి మనలను త్వరలోనే ఒక క్లిష్టస్థితి యెదుర్కొన బోతోంది. అది ముంచుకువచ్చే క్షణాన్ని దేశంలో కూడా క్లిష్టస్థితి ఉంటే. సర్వనాశనానికి కారణము అవుతుంది. అట్టి ప్రమాదము జరిగే లోపల, యిప్పుడే మనము యీ అంతరంగిక విషమస్థితిని యెదుర్కొని, దానిగుండా ఇది బయట పడటం, మంచిదికాదా?

తాత్కాలికంగా చీలిక యేర్పడటం హానికరం అని తలచుటకూడా పెద్ద పొరపాటు. పైగా, రాజకీయంగా మనం అభివృద్ధి పొందడానికి తాత్కాలికంగా కొన్ని చీలికలు అవసరం కూడ.

కాంగ్రెసులో ఉన్న అతివాదులకే నేడు మితవాదుల కంటె జాతీయైక్యతలో ఎక్కువ విశ్వాసం ఉన్నదను సంగతి ఎవరూ మరచిపోకూడదు. అందువల్లనే. మితవాదులు వర్కింగ్ కమిటీలో. ఒకే విధమైన సభ్యులు ఉండాలనీ, అతివాదులు ఐక్యవర్కింగ్ కమిటీ ఉండాలనీ, కోరుతున్నారు. కాబట్టి, నిజమైన జాతీయైక్యతకే కాంగ్రెసులో ఉన్న అతివాదులందరూ కృషి చేసి తీరుతారు. పరిస్థితుల ఒత్తిడి వల్లనే "ఫార్వర్డుబ్లాకు"ను నేడు స్థాపించవలసి వచ్చింది. ఎట్టి రాజీకి అంగీకరించని మన నాయకుల వైఖరియే దానికి కారణం.

భవిష్యత్తులో మనల నెదుర్కొనబోయే సమస్యలను పరిష్కరించడంలో మాకు సహాయం చేయవలసిందని దేశీయులందరినీ హెచ్చరిస్తున్నాను, ముఖ్యంగా "ఫార్వర్డుబ్లాకు" స్థాపించడంలో ఎక్కువ తోడ్పడవలసిందని కోరుచున్నాను."



# ఆంధ్రరాష్ట్రంలో వేసంగి పాఠశాలలు

## స్వాతంత్ర్యయోధుల్ని తరిఫీదుచేసే కేంద్రాలు

## సోషలిస్టులతో జిల్లాకాంగ్రెసు కమిటీల సహకారం

### ఇచ్ఛాపురం పాఠశాలకు సుభాష్‌బాబు సందేశం

ఇచ్ఛాపురం (ఉత్తర విశాఖపట్నంజిల్లా) లో జిల్లారైతుసంఘ, విద్యార్థిసంఘాల యాజమాన్యమున వేసంగి రాజకీయ పాఠశాల మే 1 వ తేదీని ప్రారంభించబడెను. సుమారు 60 మంది విద్యార్థులు పాఠశాలకు వచ్చిరి. పాఠశాలకు వలయు సదుపాయములన్నియు జిల్లా కాంగ్రెసు కమిటీ చేయుటకు సిద్ధముగా ఉన్నదని శ్రీ గేదెల చంద్రయ్యగారు (జిల్లా కాంగ్రెసుకమిటీ అధ్యక్షులు) తెలియజేసి, విద్యార్థుల క్రమ శిక్షణను గురించి ఉపదేశించిరి. పాఠశాలకు ప్రిన్సిపాలుగా ఉన్న శ్రీ సి. సూర్యనారాయణగారు, ఆర్గనైజరు రామకోటీశ్వరరావుగారు, పాఠశాలయొక్క ఉద్దేశములను వివరించిరి. గరిమెళ్ళ వెంకట రమణమూర్తిగారు, యితర కాంగ్రెస్, రైతు నాయకులు రాబోవు స్వాతంత్ర్య పోరాటములో యువకుల కర్తవ్యాన్ని గురించి ఉపన్యసించిరి. 2 వేలమంది జనులు బ్రహ్మాండమైన ఊరేగింపుతో పట్టణ వీధులగుండా వెళ్ళి, సాయంత్రం 5 గంటలకు బహిరంగ సభకు వచ్చిరి.

సుభాష్ చంద్రబోస్ యిచ్చిన యీ క్రింది సందేశం సభలో చదువబడెను.

"14 వ తేదీ గల తమ ఉత్తరము చూచితిని. కొద్ది దినముల క్రితం మీరు యిచ్చిన టెలిగ్రాములకు వందనములు. మీరు రైతాంగ విద్యాలయమును నిర్వహింపబూనుకొనుట నాకు సంతోషము. నేను నిన్నటి పత్రికలలో మీ పాఠశాలనుగూర్చి చూచితిని గాని ఎవరు నడుపుచున్నదీ తెలియలేదు. మీ కృషి సఫలమగు గాక. సామాన్య ప్రజలకు విజ్ఞానం యిచ్చుటకు ముందు మనము మన వర్కర్లకు తగు తర్ఫీదు యిచ్చుట అవసరము. సక్రమ పద్ధతులతో మీరు కృషి సలుపుడు."

పిమ్మట ఆచార్య రంగాగారు విద్యాలయమునకు ప్రారంభోత్సవం గావించిరి.

### పల్లెకోన

తెనాలి, రేపల్లె తాలూకాలకు ఏర్పాటు చేయబడిన పల్లెకోన వేసంగి రాజకీయ పాఠశాల మే 1వ తేదీని ప్రారంభించబడెను. సుమారు 20 మంది విద్యార్థులును, అధ్యాపకులుగా కామ్రేడ్స్ కంభంపాటి సత్యన్నారాయణ, ఎం.ఏ., బి.ఎల్., పోలేపెద్ది నరసింహమూర్తి, వావిలాల గోపాలకృష్ణయ్యగారలును, వచ్చిరి. మిలిటరీ ట్రెయినింగు యిచ్చుటకు పి. వి. కె. మూర్తిగారు వచ్చిరి. గుంటూరుజిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులైన శ్రీ కొంతెన వెంకట్రాజుగారి అధ్యక్షతక్రింద కల్లూరి చంద్రమౌళి (జిల్లా బోర్డు ప్రెసిడెంటు) ఎం. ఎల్. ఏ. గారు పాఠశాలకు ప్రారంభోత్సవం జరుపుచు, రాబోయే స్వాతంత్ర్య సమరమునకు తయారు కావాలంటే ఇట్టి రాజకీయ పాఠశాలలు ఎంత అవసరమో తెలియజేసిరి.

### నిడుబ్రోలు

ఆచార్యరంగాగారిచే 5 సంవత్సరాలక్రితం స్థాపించబడిన ఆంధ్రరాష్ట్ర రైతాంగ విద్యాలయం యీ సంవత్సరంకూడ మే 5వ తేదీని నిడుబ్రోలులో ప్రారంభమయింది. 22 వరకు బోధనా తరగతులు సాగుచుండును. విశాఖపట్నం జిల్లా రైతుసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ యన్. నరసింహమూర్తిగారు విద్యాలయానికి ప్రారంభోత్సవం చేస్తూ, నేటి మన విద్యావిధానంలో ఉన్న లోపాలను ఎత్తిచూపిరి. విద్యార్థులు - విద్యార్థినులు మొత్తం సుమారు 40 మంది వచ్చారు.

### పామర్రు

మే 5 వ తేదీ సాయంకాలం 4 గంటలకు పామర్రు రాజకీయ పాఠశాలయొక్క ప్రారంభోత్సవం కామ్రేడ్ చలసాని వాసుదేవరావుగారి అధ్యక్షతను జరిగెను. 70 మంది విద్యార్థులు, పరిసర గ్రామములనుంచి అనేకమంది ప్రేక్షకులు, వచ్చిరి. కామ్రేడ్ వాసుదేవరావుగారు యిచ్చిన ప్రారంభోపన్యాసంలో కొత్తపట్టణం, మంతెనవారిపాలెంలలో రాష్ట్ర సోషలిస్టుపార్టీవారు యిట్టి పాఠశాలలనే నిర్వహించియున్నారనీ; అక్కడ ఎక్కువగా సిద్ధాంత విషయాలకే ప్రాధాన్యత యివ్వబడినదనీ; రాజకీయ పోరాటాలను నడుపవలసిన విధానాన్ని బోధించియుండలేదనీ; అట్టి పోరాటానికి తగిన ఎత్తుగడలను బోధించిన నాడే రాజకీయ పాఠశాలలు సార్థకమౌతాయనీ; తెలియ జేశారు.

పాఠశాలకు గద్దె లింగయ్యగారు ప్రిన్సిపాల్‌గా ఉన్నారు.

కృష్ణాజిల్లా మహిళా సంఘాధ్యక్షురాలు శ్రీ వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు పామర్రు రాజకీయపాఠశాలకు ఉత్సాహవంతులైన యువతులందరూ హాజరై, తరిఫీదు పొందవలసినదిగా హెచ్చరించుచున్నారు.

ఫెడరేషన్ - సంస్థానాలు, పరిణామవాదం, రైతు ఉద్యమం, సంయుక్త సంఘటన, భారత జాతీయ పోరాటచరిత్ర, భారత కార్మికోద్యమం, శ్రామికవర్గ ప్రజాతంత్రము—బూర్జువా ప్రజాస్వామికము — ఫేసిస్టు నియంతృత్వము, విద్యార్థి ఉద్యమం, రష్యా విప్లవోద్యమ చరిత్ర, భౌతికవాదం, రాజకీయ భూగోళ శాస్త్రము, మొదలైన విషయాలపై వేర్వేరు ఉపన్యాసాలు యివ్వబడుతున్నాయి. కామ్రేడ్ మునుపల్లె రామారావు, బి. ఏ., ఎల్. ఎల్. బి., గారు మిలిటరీ డ్రిల్లు నేర్పుతున్నారు.

స్కూలు రాత్రిపూట 7 గంటల నుండి 9 గంటలవరకును; ఉదయం 6 గంటల నుండి 8 గంటలవరకు జరుగుతుంది.

### రావివారిపాలెం

దివి తాలూకా రైతుసంఘ, కాంగ్రెస్ సోషలిష్టుపార్టీల యాజమాన్యమున మే 20 వ తేదీ నుండి జూన్ 5 వ తేదీ వరకు 15 రోజులు రావివారిపాలెంలో వేసంగి రాజకీయ పాఠశాల, వలంటీరు శిక్షణ శిబిరము, నిర్వహింపబడును. ప్రతిరోజు ఉదయము, సాయంత్రము మిలిటరీ డ్రిల్లు చెప్పబడును.

విద్యార్థుల భోజన వసతులకు రుసుము రు 4 లు మాత్రమే; స్థానిక విద్యార్థులకు మాత్రం రు. 1 బ్యాడ్‌మింటన్ మొదలైన పోటీ పందెములు ఏర్పాటు చేయబడును, అని. కె సోమశేఖరప్రసాద్ (పబ్లిసిటీ ఆఫీసర్), గొర్రెపాటి వెంకటసుబ్బయ్య (ఆర్గనైజరు) గారలు వ్రాయుచున్నారు.

### మైపాడు

కడప, చిత్తూరు, నెల్లూరు జిల్లాలలోని కాంగ్రెసు వర్కర్లకు తగిన శిక్షణ నిచ్చుటకు నెల్లూరుజిల్లా మైపాడు గ్రామంలో మే 15 మొదలు జూన్ 15 వరకు నెల్లూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ, విద్యార్థి సంఘాల యాజమాన్యమున ఆర్థిక - రాజకీయ పాఠశాలకు, వాలంటీరు శిబిరమునకు, ఏర్పాట్లు జరుగుచున్నవి. జిల్లాకాంగ్రెసు కమిటీ సహాయ కార్యదర్శి కామ్రేడ్ దువ్వూరి బలరామిరెడ్డి దీనికి ఆర్గనైజరు. కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య ప్రిన్సిపాల్. డాక్టర్ పొలవళ్ళ రమణయ్యగారు వాలంటీరు ట్రెయినర్. భారతదేశ స్వాతంత్ర్య సంపాదనార్థము ఏవిధంగా సన్నాహాలు చేయవలసినదీ బోధించుట, క్రమశిక్షణ పొందిన వాలంటీరు దళాన్ని ఏర్పాటుచేయుట యీవిద్యాలయంయొక్క ఆశయం. ఒక్కొక్క విద్యార్థి రు 10 లు చెల్లించుకొనవలసియున్నది. నెల్లూరునుండి మైపాడుకు బస్సు చార్జి 0-4-0

విద్యాలయానికి ధన ధాన్య సహాయం చేయవలసినదిగా జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్ష కార్యదర్శులు విజ్ఞప్తి చేయుచున్నారు.

చిత్తూరు జిల్లానుండి ముగ్గురు విద్యార్థులను మైపాడు పంపించుటకు చిత్తూరుజిల్లా కాంగ్రెసు కమిటీ తీర్మానించింది.

### ఖండవల్లి

ప॥ గోదావరిజిల్లా కాంగ్రెస్ కార్యవర్గమువారు గత నెల 18 వ తేదీని తాడేపల్లిగూడెంలో సమావేశమై, మన జిల్లాలో మేనెల 15 వ తేదీనుంచి ఒక మాసం దినములు వాలంటీరు శిక్షణా శిబిరమును నడుపుటకు తీర్మానించియున్నారు. ఆ తీర్మానం ప్రకారము తణుకు తాలూకా, ఖండవల్లి గ్రామ పరిసరమున గోదావరీ నదీ తీరమున నెలకొల్పుటకు ఏర్పాటులు చురుకుగా కొనసాగింప బడుచున్నవి. సుమారు 300 మంది వాలంటీరులకు శిక్షణ గరపుటకు వసతులు కల్పింపబడుచున్నవి. హిందుస్థానీ సేవాదళ పద్ధతి ననుసరించి కవాతు మున్నగునవి నేర్పుటయే గాక, ప్రతిదినము సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకులచేత రాజకీయ ఉపన్యాసము లిప్పించుచు, వాలంటీర్లు శిక్షితులైన ఆర్థిక - రాజకీయ విజ్ఞానవంతులుగా, సమర్థులైన దేశ సేవకులుగా తయారుచేయబడుదురు. రుసుము నుందు తెలియపర్చబడును, అని శ్రీ భూపతిరాజు చాపిరాజుగారు (ప్రధాన కార్యదర్శి) వ్రాయుచున్నారు.

### కాల్వబుగ్గ

కాల్వబుగ్గలో కర్నూలు జిల్లా కాంగ్రెసు కమిటీ వారి ఆధిపత్యమున జిల్లా రాజకీయ పాఠశాల నిర్వహణకై విరాళములు ప్రోగుచేయుచు జిల్లా కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ కె. చెంచిరెడ్డిగారు, జిల్లాబోర్డు అధ్యక్షులు శ్రీ బి. వి. సుబ్బారెడ్డిగారు, జిల్లా కాం॥ సోషలిస్టుపార్టీ కార్యదర్శి కోడి నరసింహంగారు, కోవెలకుంట మొదలైన తాలూకాలలో సంచారము చేయుచున్నారు. ఈ నెల 20 వ తేదీని పాఠశాల ప్రారంభమగును. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు ప్రధానాధ్యాపకులుగా ఉందురని తెలియుచున్నది. 150 మందికి పైగా విద్యార్థులు వత్తురని అంచనా వేయబడుచున్నది.

### హిందూపురం

అనంతపురం జిల్లా యువజనసంఘ యాజమాన్యమున మే నెల 5 వ తేదీ నుండి హిందూపురంలో రైతాంగ సమస్యలను గురించి స్వాతంత్ర్య పోరాట సన్నాహాలను గురించి యువకులకు బోధించుటకు వేసంగి పాఠశాల నడచుచున్నది.

### తునికిపాడు

కృష్ణాజిల్లా తిరువూరు తాలూకాలో తునికిపాడు గ్రామమందు మే నెల 3 వ వారములో రైతాంగ విద్యాలయం ప్రారంభింపబడి 20 రోజులు సాగును. ఈ గ్రామం నైజాం సరిహద్దులో ఉన్నది. ఆచార్య రంగాగారు ప్రధానోపాధ్యాయులుగా ఉందురు. విద్యార్థి రుసుము 5 రూపాయలు.

### అమరావతి

గుంటూరుజిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ యాజమాన్యమున నిర్వహింపబడు అమరావతి వేసంగి రాజకీయ పాఠశాల మే నెల 18 వ తేదీ మొదలు 15 దినములు నిర్వహించబడును. విద్యార్థి రుసుము 4 రూపాయిలు. గుంటూరు, సత్తెనపల్లి డివిజను యువకులకు బహు అనుకూలముగా నుండును.

౮

రెండు మాసాలు గడిచినాక ఒకనాడు గురుచరణుడు వాడిపోయిన ముఖంతో నవీనరాయ్ ఇంటికివచ్చి తివాసీమీద కూర్చోబోతూ ఉండగా నవీనుడు ఛీత్కారంచేసి - "వద్దు, వద్దు! అక్కడకాదు. ఆకుర్చీమీదికి పోయి కూర్చో. వేళకానివేళకు నేను మళ్లీ స్నానం చేయలేను. ఆఁ, జాతి వదులుకున్నావు కాదూ?" అని అడిగాడు.

గురుచరణుడు మౌనంగా పోయి ఒక కుర్చీలో తలవంచుకు కూర్చున్నాడు. నాలుగైదురోజుల క్రిందట అతను యధావిధిగా దీక్షపుచ్చుకుని బ్రహ్మసమాజంలో చేరాడు. అసమానారమే చిత్రవిచిత్రముగా అలంకృతమై నానావిధ హింసువైన నవీనుని చెవినిపడింది. నవీనుని కళ్లవెంట అగ్నికణాలు రాలుతున్నవి. కాని గురుచరణుడు అలాగే తలవంచుకొని మౌనంగా కూర్చున్నాడు. అతను ఎవ్వరినీ పరామర్శించకుండా ఈపనిచేసినప్పటినుంచి ఇంట్లో ఏడ్పులూ మొత్తుకోళ్లు ఎక్కువైనవి. అతనికి శాంతి అనేది లేకుండా పోయింది.

"చెప్పవోయి. నిజమా కాదా?" అని నవీనుడు మరల గర్జించాడు.

గురుచరణుడు జలధారాక్రాంతమైన కళ్ళు పైకెత్తి - "చిత్తం, నిజమే." అన్నాడు.

"ఎందుకు ఇలాంటిపని చేశావు? నీకు జీతం నెలకు అరవై రూపాయలేదా, నువ్వు-" కోపంచేత నవీన్‌రాయ్ నోటనుంచి ఇక మాటపెగులలేదు.

గురుచరణుడు కళ్లు తుడుచుకొని రుద్ధకంఠాన్ని కొంచెం సవరించి - "అప్పుడంతమూరం ఆలోచించ లేదన్నయ్యా! దుఃఖాగ్నిచే తపించడంచేత మెడకు ఉచ్చుపోసుకోవాలో, లేక బ్రహ్మజ్ఞానిని కావాలో - అప్పుడు ఏమీ నిర్ణయించుకో లేకపోయాను. చివరకు ఆత్మహత్యకంటే బ్రహ్మజ్ఞానిని కావటమే మంచిదని దీక్షతీసుకున్నాను." అని గురుచరణుడు కళ్ళు తుడుచుకొంటూ బయటకు వెళ్ళిపోయాడు.

"మంచిపనిచేశావు: నీమెడకు ఉచ్చుపోసుకోకుండా సమాజము మెడకు ఉరితాడు తగిలించావు! సరేపో. ఇక నీముఖం నాకు చూపించకు నీకు సలహా ఇచ్చినవాళ్లే తోడ్పడతారు - అని అతన్ని పంపివేసి ముఖం త్రిప్పుకు కూర్చున్నాడు.

మొదట కోపంతోనూ అభిమానంతోనూ నవీనుడు ఏమిచేయాలో నిశ్చయించుకోలేక పోయాడు. గురుచరణుడు పూర్తిగా చేతిలోనుంచి తప్పించుకు పోయాడు. త్వరలో గుప్పెట్లోకి వస్తాడనే ఆశకూడాలేదు. అందుచేతనే, నిష్ఫల ఆక్రోశంతో తపించిపోయి, అతన్ని లోబరచుకునే ఉపాయం ఏదీ కానక ఆరోజునే టాపీపనివాళ్లను పిలిపించి వారింటికీ వీరింటికీ వస్తూపోతూ ఉండే దోవకు అడ్డంగా పెద్దగోడ కట్టించాడు.

గురుచరణుని మతం మార్పు, చాలాదూరాన ప్రవాసంలో ఉన్న భువనేశ్వరి, శేఖరుని నోటవిని ఏడ్చింది - "శేఖర్, ఇలాంటి బుద్ధి అతనికి ఎవరు పుట్టించారు?" అని అడిగింది.

బుద్ధి ఎవరు పుట్టించిందీ శేఖరుడు నమ్మకంగా ఊహించుకున్నాడు. కాని ఆట చెప్పకుండా - "పోనీ అమ్మా! రోజులున్నాక మీరే అతన్ని పెలివేశేవారు. లేకపోతే ఇంతమంది పిల్లల పెళ్లి ఎలాచేస్తాడో నాకు తోచటమేమీలేదు." అన్నాడు.

భువనేశ్వరి తలత్రిప్పుతూ- "ఏమీ దిగబడదు శేఖర్! అందుకోసం జాతిని వదులుకొంటే చాలా అయింది. సృష్టించిన భగవంతుడే ఆ భారం వహిస్తాడు!" అన్నది.

శేఖరుడు మాట్లాడలేదు. భువనేశ్వరీ కళ్లు తుడుచుకుని అన్నది.

"మాలలితను వెంట తీసుకుని వస్తే దానిభారం నేనే వహించవలసివచ్చేది; వహించే దాన్నికూడా! - గురుచరణుడు ఈ ఉద్దేశములోపల పెట్టుకునే దాన్ని పంపలేదని నాకేం తెలుసు? నేను నిజంగానే లలితకు సంబంధం కుదిరించమనుకున్నాను."

శేఖరుడు తల్లివంక చూసి కొంచెం సిగ్గుపడుతూ- "అయితే అమ్మా, ఇప్పుడు ఇంటికి పోయి అలా ఎందుకు చేయకూడదూ? లలిత ఇంకా బ్రహ్మసమాజంలో కలపలేదు. వాళ్ల మామే కలిశాడు. నిజానికి ఆయనకూడా లలితకు ఏమంత దగ్గరవాడుకాదు. లలితకు ఎవ్వరూ లేకపోవడం చేతనే వారింట్లో ఉంటూ ఉన్నది." అన్నాడు.

భువనేశ్వరి కొంచెంసేపు ఆలోచించి - "అదీ నిజమే. కాని మీనాన్న అదోరకం మనిషి. ఎంతమాత్రం ఒప్పుకోడు. వాళ్లతో మాట్లాడనుకూడా మాట్లాడ నివ్వడు." అన్నది.

శేఖరుని మనస్సులోకూడా ఈసందేహంఉన్నది. ఇకనేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

దీనితర్వాత ఒక్కనిముషంకూడా అక్కడఉంటానికి అతనికి మనస్సుకొలుపలేదు. రెండుమూడు రోజులు నానావిధాల ఆలోచించి ఒకనాటి సాయంకాలం తల్లి దగ్గరికివచ్చి "నాకిక్కడ బాగా ఉండుట లేదమ్మా! ఇంటికి పోదాము" అన్నాడు.

భువనేశ్వరి వెంటనే ఇష్టపడి "అలాగేపద శేఖర్! నాకూకూడా ఏమీ బాగా ఉండటంలేదు." అన్నది.

తల్లి కొడుకు లిద్దరూ ఇంటికివచ్చి చూసేవరకు ఇదివరకు మిద్దెమీద వస్తూపోతూఉన్న దోవకు గోడ అడ్డంపెట్టి ఉన్నది. గురుచరణునితో ఏవిధమైన సంపర్కం ఉంచుకోవడంకానీ, ఆఖరికి మాట్లాడటంకానీ యజమానికి ఇష్టంకాదని ఎవరినీ అడగకుండానే వారుభయులూ తెలుసుకున్నారు.

రాత్రి శేఖరుడు భోజనం చేసేటప్పుడు తల్లి దగ్గరనే ఉన్నది. ఒకటిరెండు మాటలు జరిగినతర్వాత "వాళ్ళ గిరీన్‌బాబుకు లలితను ఇచ్చి పెళ్ళి చేయటానికి మాటలు జరుగుతున్నాయట! ఇలా జరుగుతుందని నేనెప్పుడో అనుకున్నాను." అన్నది భువనేశ్వరి.

"ఎవరు చెప్పారు?" అని శేఖరుడు తల ఎత్తకుండానే అడిగాడు.

"వాళ్ళఅత్త! మధ్యాహ్నం మీనాన్న నిద్రపోయేటప్పుడు ఒకమాటు వెళ్ళివచ్చాను. ఏమి ఏడ్చింది, నాదగ్గర" అని ఒక్కక్షణం ఆగి కళ్ళు రెండూ చెరగుతో అద్దుకొని "అదృష్టం, శేఖర్ అదృష్టం! నొష్టను రాసినరాత ఎవ్వరూ మార్చలేరు. ఎవరి తప్పంటావోచెప్పు? జరిగిందేమో జరిగింది. గిరీన్‌కూడా మంచికుర్రాడే, డబ్బుకూడా ఉన్నది. లలితకేమీ కష్టం ఉండదు!" అని ఊరకున్నది.

శేఖరుడు ఏమీ జవాబివ్వలేదు. తలవంచుకొని అన్నం అటూ ఇటూ కదుపుతూ ఊరుకున్నాడు. కొంచెంసేపు ఉండి తల్లి వెళ్ళిపోయింది. తర్వాత తానుకూడా లేచి చేతులు కడుక్కొని పక్కమీదికి పోయి పండుకున్నాడు.

మర్నాడు సాయంత్రం షికారుకు పోదామని శేఖరుడు బయలుదేరాడు, అప్పుడు గురుచరణునిముందు ఇంటిలో మామూలు మాదిరిగా టీపార్టీ జరుగుతూఉన్నది. సంభాషణా నవ్వులూ మహాజోరుగా సాగుతున్నవి. ఈకోలాహలం శేఖరుని చెవిని పడగానే రోడ్డుమీద ఆగిపోయి కొంచెంసేపు ఆలోచించాడు. తర్వాత నెమ్మదిగా శబ్దాన్ని అనుసరించి గురుచరణుడు వగైరాలు ఉన్నచోటికి వచ్చి నిలబడ్డాడు. తక్షణం కలవరం అగిపోయింది: ఇతనిముఖం కనపడగానే అందరి ముఖభావాలు మారిపోయాయి: శేఖరుడు తిరిగివచ్చాడని లలితకుతప్ప ఇకెవ్వరికీ తెలియదు.

ఇవ్వాళ గిరీంద్రుడుకాక ఇంకొక యువకుడుకూడా ఇక్కడ ఉన్నాడు. అతను విస్మయంతో శేఖరునివంకచూస్తూ ఊరకున్నాడు. గిరీనుడు ముఖాన్ని కొంచెం గంభీరంగాచేసి గోడవంకచూస్తూ ఉండిపోయాడు. అందరికంటే ఎక్కువగా అరుస్తున్నది, గురుచరణుడు. అతని ముఖం ఒక్కమాటుగా తెల్లపడి పోయింది. లలిత అతని పక్కనే కూర్చుని టీ తయారు చేస్తున్నది. ఒకమాటు ముఖం ఎత్తిచూసి మరల వంచుకున్నది,

శేఖరుడు దగ్గరకువచ్చి టేబిలుమీద తలపెట్టి నమస్కారంచేసి ఒక కుర్చీలో కూర్చుని నవ్వుతూ "ఏమిటీ, అంతా ఒక్కమాసె చల్లబడ్డిందే!" అన్నాడు.

గురుచరణుడు మెల్లగా, బహుశా, ఆశీర్వదించా డనుకుంటాను, కాని ఏమన్నదీ వినపడలేదు. శేఖరుడు వారి మనోభావాన్ని గ్రహించాడు. నిన్నతాను ఏబండికివచ్చిందీ, తల్లికి జబ్బు నయమైన సంగతీ, పడమటి విశేషాలూ, ఇంకా చాలా విషయాలు, అనర్గళంగా చెప్పి చివరకు ఆ

# పరిణీత



శరత్ బాబు

విరచితం

అపరిచిత యువకునివంక చూశాడు.

గురుచరణుడు ఇప్పటికి తెప్పరిల్లుకుని కుర్రవాణ్ణి పరిచయం జేశాడు.

"ఇతను మా గిరీనుకు మిత్రుడు, ఒక్కచోటనేఇల్లు. కలిసే చదువుకున్నారు. చాలామంచివాడు. శ్యామ బజారులో ఉంటున్నా మాతో పరిచయం అయినప్పటినుంచీ, రోజుకు ఒక్కమాటయినావచ్చి పోతూ ఉంటాడు."

"చాలామంచివాడు!" అని శేఖరుడు మనస్సులో అనుకొని "కక్కాయి, అంతా క్షేమమేనా?" అడిగాడు.

గురుచరణుడు జవాబివ్వలేదు. తలవంచుకొన్నాడు. శేఖరుడు లేవబోతూ ఉండగా - "మధ్య మధ్య వస్తూ ఉండునాయనా! బొత్తిగా వదిలిపెట్టబోకు - సంగతులన్నీ విన్నావుగా?" అని రోదనస్వరంతో అన్నాడు.

"చక్రపాణి"

అనువాదం

"విన్నాను!" అని శేఖరుడు లోపలికి వెళ్లాడు.

తర్వాత లోపలినుంచి గృహిణి రోదనధ్వని వినిపించింది. బయట కూర్చున్న గురుచరణుడు గుడ్డతో కళ్లు తుడుకో నారంభించాడు. గిరీన్ అపరాధివలె ముఖంపెట్టి కిటికీలోంచి మాట్లాడకుండా బయటకు చూస్తున్నాడు. లలిత అక్కడనుంచి ఎప్పుడో వెళ్లిపోయింది.

కొంచెం సేపయినాక శేఖరుడువంట ఇంట్లోనుండి వరాండాలోకి వచ్చాడు. ఆచీకటిలో లలిత తలుపు చాటునుంచి బయటకు వచ్చి నేలమీద కూర్చుని నమస్కరించి,లేచి నిలబడింది.తర్వాత చాలాదగ్గరికి పోయి ఏదో ఆశిస్తున్నట్టుగా అతనివంక చూసి మళ్లీ వెనక్కువచ్చి - "నాఉత్తరానికి జవాబివ్వలేదెందుకు" అని మెల్లగా అడిగింది.

"ఎక్కడా? నాకు ఉత్తరం అందనేలేదే - ఏమిరాశావు?"

"చాలాసంగతులు, అవిప్పుడెందుకు పోనివ్వండి. అంతా విన్నారుగదా, ఇప్పుడు నాకేమి ఆజ్ఞాపిస్తారు?"

"నా ఆజ్ఞా! నా ఆజ్ఞతో ఏమవుతుంది?" అని శేఖరుడు విస్మయంతో అడిగాడు. లలిత శంకితయై శేఖరుని ముఖంవంక చూస్తూ - "ఎందుకని?" అని అడిగింది.

"అంతకాక ఏమిటి లలితా? నేను ఎవరిని ఆజ్ఞాపిస్తాను?"

"నన్నే ఇంకెవరిని?"

"నిన్ను మాత్రము ఎందుకు ఆజ్ఞాపిస్తాను? ఒకవేళ ఆజ్ఞాపించినా నువ్వెందుకు వింటావు?"

శేఖరుని కంఠస్వరంలో గాంభీర్యమూ కొంచెము కరుణా కనపడింది. లలిత మనస్సులో చాలాభయపడి, ఇంకోమాటు దగ్గరకు వచ్చి రోదనస్వరంలో - "పోండి, ఇలాంటప్పుడు తమాషా చేయటం నాకు బాగుండదు! మీకాళ్లమీద పడతాను, ఏం చెయ్యమంటారో చెప్పండి. భయంతో నాకు రాత్రిళ్లు నిద్రకూడా పట్టటంలేదు." అన్నది.

"భయమెందుకు?"

"బాగాఉన్నది. భయముండదా! మీరుదగ్గరలేరు, అమ్మదగ్గరలేదు, ఈమధ్యలో మామయ్య ఈపనిచేసి కూర్చున్నాడు. ఇప్పుడు అమ్మ నన్ను ఇంట్లోకి రానివ్వకపోతే?"

శేఖరుడు ఒక్కక్షణకాలం మాట్లాడకుండా ఊరుకున్నాడు. "అవును నిజమే. అమ్మరానివ్వదు. మీమామ ఇతర్ల దగ్గర చాలా డబ్బు తీసుకున్నాడు. ఆసంగతి ఆమెవిన్నది. అంతేకాక మీరిప్పుడు బ్రాహ్మలు. మేము హిందువులం."

ఈసమయంలో అన్నాకాళి వంటఇంట్లోనుంచి - "ఒదినా, అమ్మ పిలుస్తున్నది." అని కేకవేసింది. లలిత బిగ్గరగా "వస్తున్నాను!" అని తర్వాత గొంతు తగ్గించి "మామ ఏదైనా కానివ్వండి; నేనుమాత్రం మీరేదో అదే, అమ్మ మిమ్మల్ని వదలుకోలేకపోతే నన్నూ వదలుకోలేదు. ఇక గిరీన్‌బాబు దగ్గర డబ్బు తీసుకున్న సంగతి ఉన్నది. అదినేను ఇచ్చేస్తాను. రుణం అన్నాక రెండురోజులకు ఇవ్వండీ, రెండు సంవత్సరాలుండి ఇవ్వండి, తీర్చవలసిందేగా?"

"అంతడబ్బు నీకు ఎక్కడనుంచి వస్తుంది?"

లలిత శేఖరునివంక ఒకమాటుచూసి ఒక్కక్షణం మౌనంగా వహించి "ఏమో, అందరి స్త్రీలకు డబ్బు ఎక్కడనుంచి వస్తుందో నాక్కూడా అక్కడనుంచే వస్తుంది." అన్నది.

ఇంతవరకు శేఖరుడు లోపల మండిపోతున్నా పైకి తొణకకుండానే మాట్లాడు తున్నాడు. ఇప్పుడు హేళనగా "కాని మీమామ నిన్ను అమ్మేశాడుగా?" అన్నాడు.

అంధకారంలో శేఖరుని ముఖభావం లలితకు కనిపించలేదు. కాని కంఠస్వరంలో మార్పు కనిపెట్టింది. ఆమెకూడా దృఢస్వరంతో "ఆ సంగతులన్నీ అబద్ధం. మామామవంటిమనిషి ఈ ప్రపంచంలో లేడు. వారిని ఎగతాళి చేయబోకండి: వారి కష్టాలు మీకు తెలియవు, కాని లోకానికంతా తెలుసును." అని ఒక గుటకవేసి కొంచెం సందేహించి, చివరకు "అది కాక వారు డబ్బు తీసుకున్నది నాపెళ్ళి కాకపూర్వమే, నన్ను అమ్మే అధికారం వారికిలేదు. అమ్మను కూడాలేదు. ఆ అధికారం మీఒక్కరికే ఉన్నది. డబివ్వాల్సి వస్తుందని అమ్మదలుచుకుంటే మాత్రం మీరు అమ్మివేయగలరు!" అని చెప్పి జవాబుకు ఎదురుచూడకుండా తొందరగా వెళ్ళిపోయింది.

౯

ఆరాత్రి చాలా సేపటివరకు శేఖరుడు పిచ్చివానివలె రోడ్లవెంట తిరిగి అప్పుడే ఇంటికి వచ్చి ఆలోచనలో పడ్డాడు - నిన్న మొన్నటి లలిత ఇన్నిమాటలు ఎక్కడనుంచి నేర్చుకున్నది? తన ఎదుటనే సిగ్గువిడిచి ఇలా ఎలా మాట్లాడకలిగింది?

నేటి, లలిత ఆచరణచూసి శేఖరుడు నిజంగా విస్మితుడయాడు. కాని ఈ కోపానికి మూలకారణం ఏమిటో కొంచెం శాంతంగా ఆలోచించి చూచినట్లయితే - కోపం లలితమీద కాదు; తనమీదనేనని - శేఖరునికి స్పష్టంగా తెలిసిపోయేది.

లలితను వదిలి ప్రవాసంలో ఉన్న ఈ కొన్నిమాసాలు శేఖరుడు కల్పనా రాజ్యంలోనే విహరించాడు. కేవలం, కాల్పనిక సుఖదుఃఖాలూ, లాభనష్టాలూ జమాఖర్చుచేసి - తన భవిష్యత్ జీవితం లలితమీద ఎలా ఆధారపడి ఉన్నదీ, ఆమె లేకుండా జీవించటం ఎంత కఠినమైనదీ, ఎంత దుఃఖకరమైనదీ - తేల్చుకున్నాడు. లలిత చిన్నతనం నుంచీ వాళ్ల కుటుంబంలో కలిసిపోయింది. కాని, ఆకుటుంబంలో ఆమెకు ఏమిస్థానమున్నదని అతను ఎప్పుడూ ఆలోచించలేదు. ఆలోచించవలసిన అవసరమూ రాలేదు. లలిత తనకు లభించదు; తల్లిదండ్రులు ఈ వివాహానికి సమ్మతించరు. ఆమె ఎప్పటికైనా ఇతరులసొత్తు అయిపోయేదే; అనే దుశ్చింత శేఖరుని ఎప్పుడూ బాధిస్తూ ఉండేది. అందుచేతనే కలకత్తా వదలబోయే క్రిందట రాత్రి ఆమె మెడలో బలవంతాన దండవేసి ఆదుశ్చింతను అరికట్ట పోయాడు.

ప్రవాసంలో ఉండగా గురుచరణుని మార్పువిని శేఖరుడు వ్యాకులుడై ఆహర్నిశలు లలితచేతినుంచి పోతుందేమోనని దిగులు పడుతూ ఉండేవాడు. సుఖములోగానీ దుఃఖములోగాని అతను ఈవైపే ఆలోచించేవాడు. ఇవ్వాళ లలిత ఆవైపు గట్టిగా బంధించి అతని ఆలోచనా ప్రవాహాన్ని ఎదుట త్రిప్పింది! అప్పుడు చింత, ముందు లలిత లభించదేమోనని; ఇప్పుడు ఆలోచన లలిత ఇక వదలదేమోనని;

శ్యామబజారు సంబంధం తప్పిపోయింది. వారు అంతకట్నము ఇవ్వటానికి సందేహించారు. శేఖరుని తల్లికికూడా పిల్లనచ్చలేదు. అందుచేత శేఖరుడు ఈసంబంధంనుంచి మాత్రం తప్పించుకున్నాడు. కాని నవీనరాయ్ ఇరవైవేల కట్నంమాట మరచిపోలేదు. ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు.

ఏంచేయాలి? ఆరాత్రి తానుచేసినపని ఇంతగొంతుమీదకు వస్తుందనీ తనకు నిజంగా వివాహమైంది ఏవిధంగానూ ఇది మారటానికి వీల్లేదని లలిత ఇంతగట్టిగా విశ్వసిస్తుందనీ, శేఖరుడు ఊహించికూడా ఉండలేదు. 'జరగవలసిందేమో జరిగిపోయింది, ఇకనీవూ తప్పుకోలేవు నేనూ తప్పుకోలేను' అని ఆరాత్రి శేఖరుడు నోటితో అన్నాడే కాని ఇవ్వాళ ఆలోచించి చూసినట్టుగా ఆనాడు ఆలోచించి చూడలేదు. చూసేశక్తికూడా లేదు బహుశా, సమయంకూడా లేకపోవచ్చును. అప్పుడు నెత్తిమీద చంద్రుడు ఉన్నాడు, వెన్నెల పిండి ఆరబోసినట్టుగా ఉన్నది, మెడలో పూలదండ కదులుతూ ఉన్నది. ప్రేయసి స్పందనవశాన్ని తన హృదయానికి హత్తుకొని ఎప్పుడు ప్రథమ ప్రణయానుభూతిని పొందుదామా అనే మోహమున్నది, ప్రియులు అధరామృత మంటారే దాన్ని పొందాలని తీవ్రలాలస ఉన్నది. అప్పుడితనకి కావలసింది స్వార్థం; మంచి చెడులు ఇతనికి తెలియలేదు. అర్థ లోలుపుడైన తండ్రి రుద్రమూర్తి ఇతని కంటికి కనుపించలేదు. తల్లి లలితను ఎలాగూ ప్రేమిస్తున్నది. ఆమెను ఒప్పించడం ఏమంత కష్టంకాదు. తండ్రికి ఎలాగో ఒకలాగున అన్నచేత చెప్పించి కొంచెం శాంతపరిస్తే కార్యం సానుకూలమవుతుందని భావించాడు. అంతే కాక, అప్పుడు గురుచరణుడు తానీవిధంగా నాశనమయి, ఇతని ఆశకు ఈ విధంగా అడ్డుపడలేదు. ఇప్పుడు విధాతే శేఖరునికి విరుద్ధమయ్యాడు.

నిజానికి శేఖరుడు ఇంతగా ఆలోచించ వలసిందేమీలేదు. తండ్రిని ఒప్పించటం అలావుంచి తల్లిని ఒప్పించటంకూడా అసంభవమని ఇతనిపుడు గట్టిగా తెలుసుకున్నాడు. అసలు, తల్లిదండ్రుల దగ్గర ఈసంగతి వెళ్ళబెట్టే మార్గంకూడా లేదు.

శేఖరుడు దీర్ఘనిశ్వాసం విడిచి, ఇంకోమారు అస్ఫుటంగా 'ఏమిచేయాలి?' అని అనుకొన్నాడు. లలితను తను బాగా ఎరుగును. తన చేతిలోనే పెరిగింది. ఒకమాటు, ధర్మమని నమ్మినదానిని ఏవిధంగానూ వదిలిపెట్టదు! శేఖరుని ధర్మపత్నినని ఆమె నమ్మింది; అందుచేతనే, ఇవ్వాళ సంధ్యాంధకారంలో తనదాపుకు వచ్చి ముఖంమీద ముఖంపెట్టి నిలబడింది.

గిరీన్‌తో ఆమె వివాహప్రసంగం జరుగుతూ ఉన్నది. కానిఆమెను ఎవ్వరూ ఒప్పించలేకుండా ఉన్నారు. ఇక ఆమె ఏమాత్రం ఊరుకోదు! అంతా వెల్లడించి తీరుతుంది. శేఖరుని కళ్లూ ముఖమూ ఉత్తప్తమైపోయినవి. నిజమే! తనుమాలమార్పటంతో ఊరుకోలేదు. లలితను హృదయానికి హత్తుకొని ముద్దుకూడా పెట్టుకున్నాడు. ఆమె అడ్డుపెట్టలేదు - తప్పుకాదనే అడ్డుపెట్టలేదు. ఇప్పుడు ఎవరైనా అడిగితే తాను చేసినపనికి ఏమి జవాబిస్తాడు?

# లేఖలు

## విద్యాధికారుల వింత ప్రశ్నలు

ఈ సంవత్సరము పామర్రుబోర్డు హైస్కూలులో షష్టఫారమునుండి షష్ఠఫారము వరకు యివ్వబడిన ఇంగ్లీషు ప్రశ్నాపత్రములు చూచి, విద్యార్థులు మిగుల అలజడి చెందుచున్నారు. ఇందుకు కారణము, హెడ్మాస్టరుగారు చాలా పాఠములను వదలివేసి, ఈఫారముల స్టాండర్డును గుర్తించకయే యిచ్చిన అతి కఠినమైన ప్రశ్నలే. నూటికి పదిమందియైనా నెగ్గగలరను ధైర్యం లేకున్నది. మచ్చుకు కొన్నిప్రశ్నలు:— (ఇంగ్లీషులో ఈయబడినవి.)

6 వ ఫారము. ప్రశ్న 2 (ఎ):—మన రాష్ట్రంలో ఉన్న ప్రస్తుత నిరుద్యోగస్థితిలో నీవు స్వశక్తిపై జీవించుటకు యేమార్గం అత్యుత్తమముగా నీకు కన్పించుచున్నది?

(బి) యుక్తాయుక్త విచక్షణలేని దానము ముందు సుశిక్షిత దానముయొక్క విలువను వివరింపుము.

4 వ ఫారము. ప్రశ్న 2: (బి):— "ఎక్కువగా ప్రేమించువాడే ఎక్కువగా గద్దించును" యీ భావమును విపులపరచుము.

2 వ ఫారము. ప్రశ్న 2:—ఈ క్రిందిమాటలను శబ్దభేదము (సిలబుల్స్) చేయుము.

**wood-cutter; family; land-owner professions.**

ప్రశ్న:—నీవ్యాధి నివారణ అయిన పిదప వ్యాధిలో నీ అనుభవములను వర్ణించుచు నీమిత్రునికి జాబుఒకటి వ్రాయుము.

స్థలాభావము వలన యివి మాత్రమే ఉదహరింపబడినవి. విద్యాశాఖాధికారులు యీ అలజడిని గమనించి, పరీక్షాపత్రములు తెప్పించి చూచుకొని, వారికి ఉచితమని తోచు సహాయము బాలుర కిచ్చుట సమంజసము.

ఇట్లు
ఒక విద్యాభిమాని.

## పాలకొల్లు హైస్కూలులో దౌర్జన్యాలు

పాలకొల్లు హైస్కూలు విద్యార్థులు పరీక్షాపత్రములు వ్రాయుచున్న సమయములో 'వాచర్లు' తమ సంసార గొడవలన్నీ చెప్పుకొనుచూ విద్యార్థులను 'డిస్టర్బు' చేయుచున్నారు. విద్యార్థులు సోడా, టీ వగైరాలు తెప్పించుకొనుటకు అనుమతి యివ్వడం లేదు. పరీక్షాపత్రములు వ్రాయుచుండగా హెడ్మాస్టరుగారువచ్చి, కొందరువిద్యార్థులతో మీరు పైనుండి పేపర్లు తెప్పించుటకు ప్రయత్నించు చున్నారట, మిమ్ము 'డిబారు' చేయిస్తాను అని బెదరించుచున్నారు. ఇందువల్ల విద్యార్థులు కంగారుపడి పరీక్షాపత్రములు సరిగా వ్రాయలేక పోవుచున్నారు.

21-4-39 వ తేదీని విద్యార్థిసంఘ ప్రధానకార్యదర్శి అయిన శ్రీ. వి. యం. రావు పేపరు వ్రాయుచుండగా, హెడ్మాస్టరుగారు వచ్చి, హాలులోని వాచర్లను పిలిచి, "ఈయన స్టూడెంట్సు యూనియన్ సెక్రటరీగారు, ఎందుకు ఈయనకీ పదవి? ఇప్పటికి గౌరవముగా రిజైను యిచ్చుట మంచిది." అనిరి. అప్పుడా విద్యార్థి ఈ అవమానమును సహింపలేక, పేపరు యిచ్చి వెళ్లిపోవుచుండగా, పేపరు వ్రాయుట తెలియక వెళ్లిపోవుచున్నట్లు స్టేటుమెంటువ్రాసి యిమ్మని బలవంత పెట్టిరి. అప్పుడు పి. బి. కృష్ణారావు అనేవిద్యార్థి "అనవసరముగా అట్లడుగుట మీకు ధర్మమా? పేపరు వ్రాయడము పూర్తి అయిన తరువాత ప్రయివేటుగా అడుగకూడదా?" అని హెడ్మాస్టరుగారిని అడిగెను. దీనితో నీకు ఏమి సంబంధము? నీసంగతి కనుక్కొనెదనులే! జాగ్రత్త! అని ఆయన బెదరించి వెళ్లిపోయెను.

ఇట్టి అక్రమములు, దౌర్జన్యములు జరుగకుండా విద్యాశాఖాధి కారులు, ప్రజా సేవకులు, పూనుకొన ప్రార్థన.

ఇట్లు
ఒక విద్యార్థి.

## విద్యావనం

మహాజనులారా,

విద్యావనము ప్రారంభమై ఆరుమాసములు గడిచినది. పాఠశాల ప్రారంభమై అక్టోబరు మాసములోనైనప్పటికి, 30 మంది గురుకులవాస విద్యార్థులు, 30 మంది దైనిక విద్యార్థులు, ఆరుమాలములు శిక్షణపొందిరి. ప్రస్తుతము వేసంగి శలవు లివ్వబడినవి. వివిధ ప్రాంతములనుండి వచ్చిన విద్యార్థులు చాలమంది తమ స్వగృహములకు వెళ్లియున్నారు. జూన్ 15 వ తేదీన పాఠశాల మరల ప్రారంభమగును. వచ్చే జూనుకు చాలమంది విద్యార్థులు వచ్చెదరను తలంపుతో ఎక్కువ పర్ణకుటీరములువేసి విరివిగా ఏర్పాట్లుచేయుచున్నాము. ఆంధ్రదేశములో ఆధునిక వైజ్ఞానికవిద్య గరపుచు, శరీరవ్యాయామము మీదను, పిల్లల మనస్తత్వము పైనను ఎక్కువ శ్రద్ధ యిచ్చుచు, సముద్రతీరమునకు 5 మైళ్ల దూరములో విశాలమైన 40 ఎకరముల మామిడితోటలో శరీర బుద్ధిబలములకు సహాయపడు సాత్వికాహారముతో పిల్లలను పోషించి విద్యగరపు బాలబాలికల ఆదర్శవసతిపాఠశాల ఇదియేనని వేరుగ చెప్పనవసరములేదు.

ఈ పాఠశాలకు యింతవరకు ఈ గ్రామవాసులు 10 వేల రూప్యములుగల స్థిరాస్తిని యిచ్చియున్నారు. ఈ పాఠశాల నిర్వహణమునకు, రుసుము రూపకముగా పిల్లలవద్దనుంచి వచ్చుద్రవ్యముగాక, కొందరురాజకీయ బాధితుల పిల్లలను రుసుములేకయే పోషించుటకును, పాఠశాల నిర్వహణముమునకును, చేతిపనులు ప్రవేశపెట్టుటకును సంవత్సరమునకు దాదాపు 5 వేల రూప్యములు కావలసియున్నవి. ఇదియంతయు ఉదారస్వభావుల వద్దనుంచి విరాళముల రూపముగా రావలసియున్నది గాన దయతో మహాజనులన్నివిధముల తోడ్పడి విద్యావన విద్యాప్రదాన విధానమునకు తోడ్పడ వేడుచున్నాము.

ఇట్లు,
మంతెనవారిపాలెం, అ. సరళాదేవిరావు.
6—5—'39 అ. కామేస్వరరావు.

## మునగాల ఎస్టేటులో ఆచార్య రంగాగారి ప్రచారం

ది 23-4-39 న మునగాల జమీరైతుసంఘ ఆహ్వానముపైన విశాఖపట్నం జిల్లా రైతుసంఘాధ్యక్షులున్ను అసంబ్లీ సభ్యులున్ను అయిన శ్రీ పుల్లెల శ్యామసుందరరావుగారున్ను, పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు ప్రముఖులగు శ్రీ పేట బాపయ్యగారున్ను, కృష్ణాజిల్లా రైతుసంఘప్రధాన కార్యదర్శి పామిరెడ్డి సుబ్బారావు రెడ్డిగారున్ను, గత సంవత్సరపు ప్రధానకార్యదర్శి శ్రీసుంకర సూర్యనారాయణగారున్ను, అఖిలభారత రైతుసంఘ ఉపాధ్యక్షులగు ఆచార్య రంగాగారితో కలిసి మునగాల క్యు విచ్చేసిరి. వీరి రాకను తెలిసికొని తండోపతండములుగా ప్రతిగ్రామమునుండి మేళతాళములతోను, రైతుగీతాలతోను, జాతీయ, ఎఱ్ఱజెండాలతోను సుమారు 3000 మంది ఉదయం 10 గంటలకే మునగాలకు జేరుకున్నారు. అంతట స్థానిక రైతులు తమ కష్టసుఖములకు గూర్చి, ఈమధ్య శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు చేసినటువంటి రాజీషరతులను గురించి, ఆచార్య రంగాగారితో మనవి చేసుకొన్నారు. పిమ్మట భోజనానంతరము మధ్యాహ్నము రైతుప్రముఖులతో, ఈమధ్య జేసుకున్నటువంటి రాజీషరతులను గురించి, మెట్టపైరు నష్టమైనందున రిమీషను కోరువిషయమై, జమీందారు కొత్తగా రాజీషరతులను భగ్నముజేసే యెత్తులను గురించి, సవిస్తరముగా సంప్రదింపులు జర్పినారు. సాయంకాలము 3 గంటలకు టావిలర్సు బంగాళాలో జరిగిన బహిరంగసభకు సుంకర సూర్యనారాయణగారు అధ్యక్షత వహించిరి. మునగాల ఎస్టేటు రైతునాయకులు నల్లపాటి వెంకటారామ నర్సయ్యగారు వచ్చిన ప్రముఖులను ప్రజల కెరుకపర్చినారు. ప్రధమములో శ్రీ నండూరి వరప్రసాదరావుగారు ప్రసంగించుచు రాజీవిషయములను అమలు పర్చుటకు ప్రధమమునుండి ఎస్టేటువారు ఏవిధంగా అడ్డంకులు కల్పిస్తూ వచ్చినదీ, ఇప్పుడు మెట్టశిస్తుకు రిమీషను విషయములో కొత్తగా తెచ్చిన పేచీని గూర్చి సవిస్తరముగా తెలియజేసి ఈ విషయము పైననే రాజీభగ్నమైనచో ప్రజలు తమ పోరాటమును సాగించుటకు సిద్ధముగా నుండవలసినదని హెచ్చరించిరి. శ్రీకోదాటి వెంకట నర్సింహారావుగారు నాయకుల సలహాల ప్రకారము ఆచరించ వలసినదిగా హెచ్చరిస్తూ మాట్లాడినారు. తరువాత శ్రీ శ్యామసుందరరావుగారు మాట్లాడుతూ రైతులు తెల్పుకొన్న దానిని బట్టి చూడగా ఎస్టేటులో అనేక ఘోరాలు కల్గుచున్నట్లు తెలుసుకొన్నామనియు, జమీందారు కనుక రాజీషరతులను ఉల్లంఘించినచో తాము తమ సంఘ ఆశయముల ప్రకారము నడచుటకు సిద్ధముగా నుండవలె ననియు, రైతులు జరుపు న్యాయబద్ధమైన పోరాటమునకు తాము ఎప్పుడూ సహాయముగా నుందుమనియు తెలియ జేసిరి. పిమ్మట ఆచార్యరంగాగారు ఉపన్యసించుచూ ఇంతవరకు మునగాల రైతులు జరిపిన పోరాటమునకు ఆంధ్రరాష్ట్ర రైతుసంఘము, అఖిలభారత రైతుసంఘముల పక్షమున అభినందించిరి. రైతులను విచారించగా జమీందారు ఈ రాజీషరతులను అమలు జరుపుట లేదని తెలిసినదనిరి. రాజీషర్తులన్నియు ఏ తేదీ లోపుగా అమలు జర్పాలనే నిర్ణయము లేకపోవుట పొరపాటనియు, అందువల్ల రైతులు రాజీప్రకారము డిసెంబరు కిస్తీ శిస్తులు చెల్లించిననూ ఇంతవరకు జమీందారు ఒక్క షరతునైననూ నెరవేర్చుట జరుగలేదనీ అన్నారు. రిమీషను విషయమై ఎస్టేటువారు పెట్టుచున్న షరతులు అన్యాయమన్నారు. రు 0-2-0 రిమీషను పంటనష్టమును బట్టి ఎంచినచో మిక్కిలి హీనమనియు అయినప్పటికి జమీందారు అంగీకరించకపోవుట మరీదారుణమన్నారు. రాజీభగ్నమైతే తిరిగి రైతులు 0-8-0 రిమీషను కోరవచ్చుననియు, అదైననూ ఇవ్వగల్గిన రైతులైతే రిమీషను మినహా తక్కినశిస్తు చెల్లింపవచ్చుననీ, ఇవ్వగల్గిన రైతుల వద్దనే శిస్తువసూలు చేసుకోవాలనియు, ఇవ్వలేని రైతువద్ద వసూలు చేసినచో అన్యాయమందుననియు దెల్పినారు. రైతుసంఘాన్ని బలపర్చుకొని ముందు సాగించవలసిన కార్యక్రమమునకు సిద్ధముగా నుండవలసినదని తెలియజేసినారు. ఇప్పుడు రాజీలో వచ్చిన తగాదా విషయమై బ్రహ్మయ్యగారికి, ప్రభుత్వానికి తెలియజేసి, వారు జోక్యం కలుగజేసికొననిచో తిరిగి పోరాటమును ప్రారంభించు చున్నామని తెలియజేస్తూ నోటీసు ఇవ్వవలెనన్నారు. పిమ్మట అధ్యక్షులైన సూర్యనారాయణగారు రైతులందరూ కట్టుబాటుగా వుండవలసినదనియు రైతులలో ఐక్యత కలిగితే ఏజమీందారైననూ ఏమీ చేయజాలడనియు, తెలియజేసిరి.



## ప్యారీ కంపెనీ పనివారల సార్వజనిక సమ్మె

### అరెస్టులు—లాఠీచార్జీలు—ఎక్ష్టెరన్‌మెంటు ఆర్డర్లు.

ప్యారీ కంపెనీ లిమిటెడ్ యూరోపియన్ పెట్టుబడితో సామర్లకోట, రాణీపేట, నెల్లికుప్పం, తురే కేంద్రములందు చక్కెర ఫ్యాక్టరీలు నిర్మించి, విపరీతమైన లాభములు గడించుచున్నది. వీరివద్గర పనిచేయు కార్మికుల జీవనోపాధులు మాత్రము నాశనం గావింప బడుచున్నవి. సామర్లకోట ఫ్యాక్టరీ కార్మికులు తమకు కొద్దిపాటి వసతులైననూ సంపాదించుకొనుటకు 1938 జులై 25 వ తేదీన సమ్మెచేసిరి. తత్ఫలితముగా కొన్ని సౌకర్యాలు పొందగల్గిరి. కాని పనివారల ముఖ్యమైన కోర్కెలు మాత్రము నెరవేరలేదు. యజమానులు పనివారలను శిక్షించమని హామీ యిచ్చిననూ అది తృణీకరించి సామర్లకోటలో 12 మంది పనివారను పనిలో నుండి తొలగించిరి.

ఒకేపరిశ్రమలోని కార్మికులుతమమధ్యఅన్యోన్యతను అభివృద్ధి చేసుకొనవలసిన యవసరమును గుర్తించి, ఈ నాలుగు కేంద్రములందలి పనివారలు కలసి ఫెడరల్ కమిటీని యేర్పర్చుకొనిరి. డిశంబరు 21 వ తేదీని ఈ ఫెడరల్ కమిటీ పనివారలకు, ప్రివిలేజిలీవు, సికోలీవు, యూనియన్‌ను గుర్తించుట మొదలగు కోర్కెలను నెరవేర్చవలెనని తెలియజేయుచూ లేనియెడల సమ్మె చేసెదమని యజమానులకు నోటీసు యిచ్చిరి. ఫిబ్రవరి 3 వ తేదీన లేబరు కమీషనరు సంఘ ప్రతినిధులతో సంప్రదించెను. కాని పనివారలు ప్రస్తుతము తమ కోర్కెలను కోరుట సమంజసము కాదను భావము వెల్లడించెను. కార్మికశాఖామంత్రి గిరిగారితో ఫెడరల్ కమిటీ కార్యదర్శి జరిపిన చర్చల ఫలితముగాసమ్మె నోటీసుతాత్కాలికముగా వుపసంహరించుకొనిరి. కాని కార్మికుల కోర్కెలుమాత్రం నెరవేర్చబడు సూచనలు కనబడలేదు. అందువలన యేప్రియల్ 1 తేదీని తిరిగి వారము రోజులలోపు తమ కోర్కెలు నెరవేర్చనియెడల సమ్మె చేయవలసియుండునని తెలియజేయుచూ నోటీసు యిచ్చిరి. కాని యజమానులు కార్మిక సంఘముతో సంప్రదింపులుకూడా చేయలేదు. కార్మిక సంఘమువారు 25 వ తేదీవరకు వేచియుండిరి. 24 వ తేదీన యజమానులు పనివారలకు (సంఘము కాదు) వారియొక్క యుక్తమగు కోర్కెలు చర్చించెదమని తెలియచేయుచూ నోటీసు యిచ్చినట్లు ప్రకటించిరి.

యెట్టి గత్యంతరములేక, సామర్లకోట, రాణీపేట, నెల్లికుప్పం, కార్మికులు 26వ తేదీ నుంచి సమ్మె చేయవలసి వచ్చింది. మన మద్రాసు రాష్ట్రములో ఒకే పరిశ్రమలోని కార్మికులు అందరు జనరల్ స్ట్రయికు చేయుటకిదియే తొలిసారి. ఈ సమ్మెలో దాదాపు 3000 మంది పాల్గొను చున్నారు.

మద్రాసు మంత్రివర్గము, పరిస్థితులు విషమించ కుండుటకు తగు శ్రద్ధ వహించినదనే చెప్పాలి. కాని, వారి యజమానులమీదకంటె పనివారిమీద సమ్మె ఆపుచెయ్యాలని యెక్కువ ఒత్తిడి కలిగించుచున్నారు. ప్రధాని రాజాజీ, తాను ఏ.ఐ.సి.సి. నుండి తిరిగి వచ్చునరకు సమ్మె వాయిదా వేయవలెనని, కార్మికసంఘమునకు తంతి నంపుచు, సమ్మెదార్లులసభ యేర్పాటుచేసి ఆసభలో కార్మిక శాఖామంత్రి గారు వుపన్యశించుటకు యేర్పాట్లు చెయ్యాలని కడలూరు టౌను కాంగ్రెస్ కమిటీకి తంతి నంపాడు. ఆయీ జిల్లా మేజస్ట్రేటులకు సంఘ ప్రతినిధులతో సంప్రదించి మే 1 తేదిలోపు పనివారలందరు పనిలోకి వెళ్ళినయడల పనివారెవ్వరు శిక్షింపబడరని తెలియచేయ వలెనని వుత్తరువులు జారీ చేయబడినవి, కాని పనివారల కోర్కెలు వెంటనే నెరవేర్ప గల్గినవి, యజమానులు వెంటనే నెరవేర్చునట్లు చేయుటకు ప్రభుత్వము ప్రయత్నించలేదు సరిగదా కనీసము విచారణ కమిటీని నియమించెదమనియైననూ తెలియచేయలేదు. ప్రభుత్వ ప్రకటనలందు కార్మికులపై దోషము ఆరోపింపబడినది. ఇది యజమానులు సాకుగాకొని, చెరుకు పండించు రైతులను పనివారలకు వ్యతిరేకము చేయుచు, సమ్మెవిచ్ఛిన్నము చేయుటకు ప్రయత్నించు చున్నారు, గిరిగారి వుపన్యాస ధోరణి కూడ కార్మికులను నిందపాలు చేయుచూ, తానూ కార్మికుడని, తనమాట లక్ష్యపెట్టుట పనివారలకే వదిలివేయుచున్నానని తెలియచేశాడు. కాని కార్మికులకు మాత్రము తృప్తి కలుగలేదు. సమ్మె సాగుచున్నది. కార్మికులు పికిటింగుకు చేయుచున్నారు.

సామర్లకోట కాంగ్రెస్ కమిటి అధ్యక్షులు కార్మికులకు సంపూర్ణ సహకారము చేయుచున్నాడు.

### అరెస్టులు - లాఠిచార్జీ.

6 వ తేదీ రాత్రి నెల్లి కుప్పం లేబరు యూనియన్ అధ్యక్ష, వుపాధ్యక్ష, కార్యదర్శులమీదను, యితర ప్రజా సామాన్యము మీదను నెల్లికుప్పంకు 5 మైళ్ళ ఆవరణలోపు బహిరంగ సభలు, వూరేగింపులు నెలవరకు జరకూడదని వుత్తరువు జారీచేయబడినది. ఈ వుత్తరవు సమ్మెను చెడగొట్టుటకు జారీ చేయబడినదని వేరే చెప్పనవసరము లేదు. కార్మికులు 7 వ తేదీ వుదయం యీ వుత్తరువును వుల్లంఘించుటకు 150 మంది మందితో వూరేగింపు జరిపిరి. పోలీసులు లాఠీచార్జి చేసినారు. అనేకమంది కార్మికులు గాయపడిరి. యూనియన్ అధ్యక్ష, కార్యదర్శులు అరెస్టు చేయబడిరి. రాణీపేట కార్మిక సంఘాధ్యక్షుని పైన నెల్లికుప్పంను 6 గంటలలో వదలి వెళ్ళవలెనని 5 మైళ్ళ ఆవరణలో నెల రోజులవరకు అడుగు పెట్టకూడదని (Externment order) యక్ష్టరన్‌మెంటు జారీ చేయబడినది. కాంగ్రెస్ మంత్రులు అధికారములోనికి వచ్చిన తరువాత ఇలాంటి వుత్తరువు జారీచేయుటకు యిదే తొలిసారి.

రాణీపేటలోకూడ 144 సెక్షనుక్రింద కార్మికులపై వారి నాయకులపై 2 నెలలవరకు బహిరంగసభలు గావింపబడరాదని నిషేధపు వుత్తరవు జారీ చేయబడినది.

సమ్మె పరిస్థితును తీవ్రమగుచున్నవి. నెల్లికుప్పంలో 38 మంది పికిటింగు చేయుచున్నందులకు అరెస్టు చేయబడి 13 గురు శిక్షింపబడిరి. సమ్మె పరిస్థితులు మరింత విషమించక పూర్వం మద్రాసు ప్రభుత్వ కార్మికుల కనీసపు కోర్కెల నిర్వహణకు పూనుకొందురని యాశించు చున్నాము, లేనియెడల జిల్లారాష్ట్ర కాంగ్రెస్ కమిటీలు మద్రాసు ప్రభుత్వముమీద తగు ఒత్తిడి కలిగించెదరని యాశించు చున్నాము.

## రైల్వే బ్రాంచి కార్మిక మహాసభలు

యం. యస్. యం. రైల్వే పనివారల యూనియన్, బెజవాడ బ్రాంచి సంవత్సర సమావేశము, యం. పున్నారెడ్డిగారి అధ్యక్షత క్రింద బెజవాడలో 29, 30 తేదీలలో జరిగింది. 29-4-39 తేదీన లేబరు రాలీ జరిగింది. 30-4-39 ఉదయం వి. వి. నరశింహం **M. L. A** గారు యూనియన్ ఆఫీసుమీద కార్మికజండా ఎగరవేశారు. ఆర్ వి, సుబ్రహ్మణ్యంగారు, యితర స్టేషన్లనుంచి వచ్చిన ప్రతినిధులను ఆహ్వానించిరి.

### కార్యదర్శి నివేదిక

కార్యదర్శి వై. వి. గోపాల్‌గారు 1939 సంవత్సర నివేదికను చదివారు. ముఖ్యాంశములివి.

"నెల కొకసారి కార్యనిర్వాహక వర్గము కలుసుకుంటూ రైల్వేపనివారల కష్టాలను గురించి వచ్చిన రిపోర్టులను పరిశీలించి, వాటి నివారించుటకు ఒక కార్యక్రమము నిర్ణయించేది. ప్రమోషన్లను అన్యాయములు బహిరంగ సభలు పెట్టి ఆందోళన చేశాము. రైల్వే అధికారులు మొబైల్ గ్యాంగులు ఏర్పాటుచేస్తే, ప్రతి సెక్షనులో సభలు జరిపి, దానికి అసమ్మతిని తెలియ జేశాము. పై అధికారులకు పనివారల కష్టాలను గురించి విన్నవించాము, 12 కార్యనిర్వాహకవర్గ సమావేశములు జరిగినవి. 25 బహిరంగసభలు జరిపాము. అందులో రైల్వే పనివారల కష్టాలను గురించి 18 సభలు జరిపాము. మే 1 తేదీ, యుద్ధ ప్రతికూలదినము, బొంబాయి కార్మిక తగాదా చట్టము అసమ్మతి, మద్రాసు రాష్ట్రములో కార్మిక శాసనమును గురించి సభలు జరిపాము.

ప్రతి సెక్షనుకు అర్గనైజర్లను పంపుతూ ప్రచారం సాగించాము కరపత్రాలు విరివిగా ప్రకటించాము. ప్రతినెల 4 పేజీలుగల ఒక బులిటెన్ పనివారల కష్టాలు, రూల్సు తెలియజేస్తూ ప్రకటించాము.

4 గురుకు ప్రమాదమైన గాయములు తగిలితే నష్టపరిహారము యిప్పించాము. ఒక్కొక్కరికి షుమారు రు 600 వచ్చినవి.

ప్రతిరోజు ఆఫీసులో అప్లికేషన్లు వ్రాయటం, సంజాషీలు వ్రాసియివ్వటం, జేస్తూవున్నాము. కార్మికులు జబ్బుపడినందుకు స్టాఫ్ బెనిఫిట్ ఫండుకు వ్రాస్తూ వారికి కొంత సహాయమును యిప్పించ గలిగినాము.

అధ్యయన తరగతులు ఏర్పరచి, రైల్వే పనివారలకు ఆర్థిక, రాజకీయ, పరిజ్ఞానము పెంపొందించుటకు కృషి జేసాము. బ్రాంచి సభ్యత్వము 1,127."

యం. వున్నారెడ్డిగారి అధ్యక్షోపన్యాసం.

"బ్రిటిషు పెట్టుబడి దారులు 800 కోట్ల రూపాయలు హిందూ దేశ రైల్వేలమీద పెట్టుబడి పెట్టారు. ఈ పెట్టుబడికి వడ్డీ గ్యారంటీ చేయబడింది. 1800 అఫీసర్ల జీతాలకు 3 కోట్ల రూపాయలు యివ్వాలి. మిలిటరీ రైల్వేలకు 3 కోట్ల రూపాయలు ఖర్చుగుచున్నవి. రైల్వేలపై వచ్చు ఆదాయములో యీ ఖర్చులన్నీ పోను మిగిలినదానిలో పనివారల జీతాలకుగాను వుపయోగించుచున్నారు. రైల్వే ఆదాయము తగ్గుతున్నదనే "వింత" కారణాలతో 1928 లో ఉచిత గృహ సౌకర్యాలను తగ్గించారు. 1930 నుంచి 1935 లో 8,17,000 నుంచి 7,01,000 పనివారలకు తగ్గించి, 41,500 మైళ్ళనుంచి 43000 మైళ్ళవరకురైల్వేలను పొడిగించారు. క్రొత్త జీతాలపద్ధతి ద్వారా జీతాలలో 4వ వంతు తగ్గించారు. పైగా ఫెడరల్ రైల్వే అధారిటీని అమలులోనికి తీసుకొని రాబోవుచున్నారు. 1939—40 కు, 2 కోట్ల, 13 లక్షలు ఎక్కువ ఆదాయమును అంచనా వేశారు. కాని పనివారల సౌకర్యాల మాట ఆలోచించనే లేదు, సెలవల విషయములో అనేక బాధలు పీడుపడుచున్నారు. రు. 20 లు లోపు కార్మికులలో 97% మందికి ప్రావిడెంటుఫండు లేదు. ప్యాసులు తగ్గించుచున్నారు. ఆఫీసర్లు తక్కువ జీతగాండ్రను నీచముగా చూడడం సహజమైపోయింది.

మన యీ కష్టాలు పోగొట్టుకోవాలంటే మన యూనియన్ అభివృద్ధి జేసుకోవాలి. 100% సభ్యులు వుండేటట్లు చూడాలి, అఖిలభారత రైల్వే పనివారల సమ్మేళమును బలపరచాలి.

స్వాతంత్ర్య పోరాటములో మన కర్తవ్యమును నెరవేర్చుటకు కాంగ్రెసును బలపరచాలి. కాంగ్రెసు నాయకులకు, రైల్వేబోర్డులో మనం జరిపే పోరాటము స్వాతంత్ర్య పోరాటములో ఒక భాగమని తెలియజేయాలి."

* * *

యం. యస్. యం. రైల్వే పనివారల రాజమండ్రి 2 వ వార్షిక సమావేశము కూడ 26-4-39 తేదీని సాయంత్రం 6 గంటలకు జరిగింది. కామ్రేడ్ యం. పున్నారెడ్డిగారు అధ్యక్షత వహించారు. శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు సభా ప్రారంభము గావించారు. సంఘ కార్యదర్శి నివేదికను చదివాడు.

### కార్యదర్శి నివేదిక.

"1937-38 లో సంఘ సభ్యుల సంఖ్య 720 నుండి 38-39 లో 793 కి హెచ్చింది. మెంబర్ల లిస్టును సకాలంలో తయారుచేసి పంపనందున నియోజకవర్గపు పట్టికలో చేర్చబడలేదు. ఈ సంవత్సరము అట్టి లోపములు రానీయకూడదు. లైనుమీద అర్గనైజరుగా వెంకటరమణయ్యగారు పనిచేసిరి. పనివారల కష్టాల నివారణకు అర్జీలు యూనియన్ ద్వారా పంపబడినవి. యీ సంవత్సరం 8 కమిటీ మీటింగులు అసాధారణ మీటింగులు జరిగాయి; లైనుమీద చాల సభలు జరిగాయి. బ్రాంచి ఆఫీసునుండి కొంతకాలము బులిటెన్లు ప్రకటించి కారణాంతరములచే నిలిపివేశాము. దానిని తిరిగి పునరుద్ధరించాలి. బ్రాంచి ఆఫీసు పెట్టుటకు స్థలం గవర్నమెంటునుండి సంపాదించాలి. 1-4-39 తేదీకి చితాను నిల్వవున్న జమ రు 122-7-3 లు మాత్రమే."

యీ నివేదికను సభవారు ఆమోదించారు. అనంతరం యూనియన్ అభివృద్ధికై తీవ్రంగా కృషిచేసిన మిషన్ టర్నర్ వి. రామమూర్తిగారి అకాలమరణమునకు సానుభూతి తీర్మానం ఆమోదింప బడింది. తరువాత అధ్యక్ష, కార్యదర్శులు, కార్యనిర్వాహక వర్గము ఎన్నుకొనబడినది.

తరువాత, ప్రెసిడెంటుగారు, తుని ట్రాలీమాన్ అయిన కిల్లాడి అప్పన్నగారిని, పోలీసులు తునిలోని ఏ. ఇ. ఇంటివద్దజరిగిన చోరీ సందర్భములో అనుమానించి పెట్టుచున్న పాట్లను వెల్లడించే ఒకలేఖను చదువగా సభ్యులందరు విచారించి, యీ విషయమై జోక్యము కలిగించుకొని పనిచేయుటకు ఒక కమిటీని నియమించిరి.

తదనంతరం వందనములతో సభ ముగిసినది.

# అఖిలభారత రైల్వే కార్మిక మహాసభ

మే 1 వ తేది అంతర్జాతీయ కార్మిక దినోత్సవము. ఆరోజు ప్రతిదేశములో కార్మికులు వుత్సవాలు జరిపి, ప్రపంచ కార్మికుల ఐక్యతను చాటుతారు. అట్టి మే 1 తేదీన పెరంబూరులో యం. యస్. యం. రైల్వేపనివారల యూనియన్ ఆఫీసు చుట్టూ ఎర్రతోరణాలు కట్టబడ్డాయి. ఆవరణమంతా ఎర్రకాగితాలతో అలంకరించబడింది. ఉదయంనుంచి యూనియన్ వాలంటీరులు అప్పటికి వచ్చేవారి నందరిని ఆహ్వానించుచున్నారు.

అఖిలభారత రైల్వే పనివారల సమ్మేళనము ప్రతి సంవత్సరము రైల్వేబోర్డు వారితో చర్చించుటకు వెళ్ళినప్పుడల్లా, ఢిల్లీ, సిమ్లాలోగాని జరుగుతూ వుండేది. కాని యీ సంవత్సరము మే 1 తేదీన పెరంబూరు యూనిటీహాసులో సమావేశమైంది. అనేక రైల్వే పనివారల యూనియన్లనుండి ప్రతినిధులువచ్చారు హిందూదేశములో వున్న ముఖ్యమైన రైల్వేయూనియన్లు ఆసభలో పాల్గొన్నవి. జమ్నదాస్ మెహతాగారు అధ్యక్షత వహించారు. వి. వి. గిరిగారు యీ మహాసభ ప్రారంభోపన్యాసములో యీవిధముగా చెప్పారు. "దాదాపు 2 సంవత్సరముల నుంచి అఖిలభారత రైల్వేపనివారల సమ్మేళనముతో నాకెట్టి సంబంధంలేకపోయినప్పటికీ.నాహృదయమంతావారిమధ్యనేవుంది. హిందూదేశములో రైల్వే పనివారల యూనియన్లు యింకా బలపడలేదు. 9 సంవత్సరముల నుండి పనిజేస్తూ వున్నప్పటికీ అట్టి యూనియన్లను యజమానులు గుర్తించలేదు. చాలామంది మద్రాసు గవర్నమెంటు వారికి రైల్వేలపైన అధికారము లేదనుకుంటూ వున్నారు రైల్వేలు కేంద్రప్రభుత్వమునకు చెందినప్పటికి యీ రాష్ట్రములో రైల్వే యజమానులు, పనివారల మధ్య శాంతిని కాపాడుటకు, మద్రాసు గవర్నమెంటుకు అధికారముంది." ఈరోజున రైల్వే యూనియన్లను బలపరచవలసిన అవసరమును గూర్చి విపులంగా జెప్పారు.

మద్రాసు ప్రభుత్వముయొక్క కార్మిక విధానము తెలియజేస్తూ, న్యాయమైన కోర్కెలను అంగీకరించని యజమానులపైన చర్య తీసుకొనుటకు గవర్నమెంటు వెనుదీయదన్నారు. పనివారలకు సమ్మె హక్కువుంది తీరాలి కాని జాగ్రత్తగా ఆలోచించి ఆఖరి ఆయుధంగా వుపయోగించాలని కార్మిక నాయకులను హెచ్చరించారు.

జమ్నదాస్ మెహతాగారి అధ్యక్షోపన్యాసములో యీవిధంగా జెప్పారు. "తక్కువజీతం, ఎక్కువ గంటల పని, రైల్వే పనివారల నిత్యజీవితం అయిపోయింది. 1, 14,000 రైల్వే పనివారలను తగ్గించారు. వీరందరు యింతవరకు నిరుద్యోగులుగానే వున్నారు. రైల్వే బోర్డువారు, ప్రతి రైల్వే అధికారులు పనివారలలో వున్న అసంతృప్తిని గ్రహించినట్లు లేదు. వాషింగుటను చట్టము, పని జేసే గంటల విషయంలో, మనదేశములో అమలు పరచలేదు. పనిజేసే గంటల నియమావళి (Hours of Work Regulation) లోకి రాకుండా 2 లక్షలమంది రైల్వే కార్మికులు వున్నారు. అఖిలభారత రైల్వే పనివారల సమ్మేళనమును, రైల్వే బోర్డువారు యీసందర్భములో, ఆలోచించి రైల్వే పనివారల వుద్దేశములను తెలుసుకోలేదు. 30% జీతాలలో కోత కోసారు. కొద్ది జీతాగాండ్రలో నూటికి 97 మందికి ప్రావిడెంటుఫండ్ సౌకర్యములేదు. వారందరికి ప్రావిడెంటుఫండు యివ్వటము చాలా అవసరము. సెలవలు ప్యాసులు, విషయంలో రైల్వే పనివారలు చాలా యిబ్బందులు పడుచున్నారు. వీటిలో ఆఫీసర్లు పొందే సౌకర్యాలకు, కొద్ది జీతగాండ్రు పొందే సౌకర్యాలకు చాలా వత్యాసమున్నది. గవర్నమెంటు అఫ్ ఇండియా వారు, ట్రేడ్ డిస్ప్యూటు యాక్టును చాలా విషయాలలో అమలు జరపలేదు. అధునప్పుడే రైల్వే బోర్డు రైల్వే కార్మికులను పెట్టుచున్న యిబ్బందులను, విచారించుటకు ఒక కన్‌సిలియేషన్‌బోర్డు నియమించాలని గవర్నమెంటువారిని అడగాలి.

రైల్వేపనివారల యూనియన్లు, యజమానులు గుర్తించు విషయములో రాయల్ కమీషన్‌వారు జేసిన సూచనలను రైల్వేబోర్డు, రైల్వే మానేజిమెంట్లు అమలు జరుపలేదు. రైల్వేబోర్డువారితో చర్చించి, రైల్వేపనివారి సమ్మేళనమువారు ఒక ప్రణాళిక తయారు జేసేసారు. 1939 జనవరి మీటింగులో రైల్వేబోర్డు ఆ ప్రణాళికను అంగీకరించింది. కాని రైల్వే ఏజంట్లు వాటిని ఆచరణలో పెట్టలేదు ఇప్పుడు రైల్వే ప్రమాదములు చాలా హెచ్చు అయినవి. రైల్వే అధికారులు (Sabotage) అనే వింత కారణాలు జెప్పుచున్నారు. ఈ ప్రమాదాలు జరిగినప్పుడు చిన్న వుద్యోగస్థులను బాధించుతారు. ఈ ప్రమాదాలు ఎందుకు జరుగుచున్నవో విచారించుటకు ఒక స్పెషల్ కమిటీని నియమించాలి.

## మా ప్రతినిధి

ప్రపంచపరిస్థితులను గురించి చెప్పుతూ నానాజాతి సమితియొక్క అసమర్థతను గూర్చి తెలియ జేసారు. ఫాసిస్టుల చర్యల విమర్శించారు. ప్రపంచ సంగ్రామము వచ్చే పరిస్థితులు వున్నవని తెలియజేస్తూ, పనివారలందరు తమ సంఘములను బలపరచుకుంటూ యిట్టి సమయములో రైల్వేబోర్డును వత్తిడి జేస్తే తప్పక కొన్ని హక్కులు యిస్తారని తెలియజేసారు.

యస్. గురుస్వామిగారు 1937-38, 1938-39 సంవత్సరాల రిపోర్టు చదివారు. గవర్నమెంటువారు తగాదాలు పరిష్కరించుటకు ఒక ఆఫీసరును కలకత్తాలో నియమించారు. ఇది విట్లీ కమిషనువారి సూచనలకు విరుద్ధము. రిపోర్టులు ద్వారా, రైల్వేబోర్డును పనివారల ఫెడరేషనుకు జరిగిన చర్చలను ప్రకటించుచున్నామన్నారు. రైల్వే ఆదాయములు హెచ్చినప్పటి పనివారలందరికి ప్రావిడెంటు ఫండు, ఎక్కువ సెలవలు, యూనియన్లను గుర్తించుట, తక్కువ గంటల పని, తక్కువజీతాల పద్ధతి పోవుట, ప్యాసు ఎక్కువగుట మొదలగు ముఖ్యమైన చట్టాలు త్వరలో వచ్చె సూచనలు కనబడుటలేదని చెప్పారు.

సెక్రటరీ రిపోర్టును ఆమోదించిన తరువాత యన్. యం. జోషిగారు ఉపన్యసించారు. "మీరు యూనియన్లను బలపరచాలి. ఫెడరేషన్ వారు ఒకవారం నియమించితే, ఆవారంలో ప్రతిరైల్వే యూనియన్ తీవ్ర ప్రచారము జేయాలి. ఒక డిమాండు తీసుకొని పోరాటము సాగించాలి. పనిజేసే గంటలవిషయమై కేంద్రశాసన సభాసభ్యులు రైల్వే పనివారలక్కు సహాయం జేయాలి. రెండవ విషయము ప్రావిడెంటు ఫండు. ప్రజాసామాన్యము యీ రెండు డిమాండులను బలపరుస్తుంది. కేంద్రశాసనసభలోని కాంగ్రెసు పార్టీలో కొంతమంది కార్మికుల యెడల అభిమానులు లేనిదే ఆ కాంగ్రెసుపార్టీ కార్మికులకు సహాయం జేయటములేదుఅని, రైల్వేపనివారల ఫెడరేషనును బలపరచవలసిన అవసరమును గురించి వుపన్యసించారు.

తరువాత యీక్రింది కార్యనిర్వాహక వర్గమును ఎన్నుకున్నారు.

జమ్నదాస్ మెహతా (అధ్యక్షులు)
యన్. యం. చటర్జీ (E. B. Rly)
సయ్యద్ హమీద్ (M. S. M. Rly)
జే. బెంజిమెను (G. I. P. Rly)
ఉపాధ్యక్షులు
యస్. గురుస్వామి (కార్యదర్శి)
జే. డి. ప్రాన్‌సిస్సు (కోశాధికారి)

యస్. గురుస్వామిగారు యీ క్రింది తీర్మానమును ఉపపాదించారు,

"రైల్వే బోర్డువారు, రైల్వేపనివారలడిగువ కనీసపు కోర్కెలను యింతవరకు నెరవేర్చలేదు.

1. అందరికి ప్రావిడెంటు ఫండు.
2. ఎక్కువ సెలవలు.
3. ప్యాసురూల్సు మార్చుట.
4. జీతం ఎక్కువ జేయుట. మొదలగునవి.

రైల్వే ఆదాయములు హెచ్చుచున్నప్పటికి పనివారల ఎడల నిర్లక్ష్యభావం జూపుటచేత. యీసభవారు యీ అన్యాయములను గవర్నమెంటుకు తెలియజేస్తూ ట్రేడ్ డిస్ప్యూట్సుయాక్టు క్రింద. తగాదా పరిష్కార సంఘమును నియమించాలి మూడు నెలల లోపల తగిన జవాబు రాకపోతే మూడు నెలల తరువాత మరల రైల్వే పనివారల ఫెడరేషను కలుసుకొని అప్పుడు ఏమి చేయవలసింది నిర్ణయిస్తుంది.

ఈ తీర్మానమును డి. యస్. వైద్యాగారు బలపరచారు.

యన్. రామచంద్రరావుగారు యీక్రింది తీర్మానమును ఉపపాదించారు. "మైసూరు గవర్నమెంటువారు రైల్వే పనివారలమీద జేసిన ఆంక్షను తొలగించి, వారు తమ ట్రేడ్ యూనియన్ ఏర్పాటు జేసుకొనేందుకు అవకాశ మివ్వాలి." ఏకగ్రీవంగా ఆమోదించ బడింది.

కే. యల్. నరసింహంగారు యీతీర్మానమును ఉపపాదించారు, "ఫెడరేషను పని సక్రమముగా జరగాలంటే డబ్బు కావాలి. కావున ఒకవారం నిర్ణయించి వారంలో గురుస్వామిగారు ఉపపాదించిన తీర్మాన ప్రచారము జేస్తూ. ఫెడరేషన్‌ను బలపరచవలసి ఆవశ్యకతను పనివారలకు తెలియజేస్తూ చందాలు వసూలు జేయాలి."ఏకగ్రీవంగా ఆమోదించ బడెను.

ఫెడరల్ రైల్వే అథారిటిని, గర్హించుచూ ఒక తీర్మానం. రైల్వే ప్రమాదములు జరిగినప్పుడు వాటిని గురించి విచారించుటకు నియమించు కమిటీలలో కార్మికుల ప్రతినిధిని కూడా నియమించాలని కోరారు.

ఈముఖ్యమైన తీర్మానములతో హిందూదేశ కార్మికులు మే 1 తేదిన తమ కష్టములను పొగొట్టు కొనుటకు ఒక నిర్ణయమునకు వచ్చారు. ప్రతినిధులందరు తమ తమ రైల్వేలక్కు పోయి ఫెడరేషన్ తీర్మానములు ప్రచారం జేయాలని నిశ్చయించు కొన్నారు.



# రైతు ఉద్యమంమీద రౌడీల దండయాత్ర

ఏప్రిల్ 23 వ తేదీని మొదటి ఫరీద్‌పూర్ (బెంగాల్) జిల్లా రైతు మహాసభ మహాతల గ్రామంలో కామ్రేడ్ ముజఫర్ అహమ్మద్ అధ్యక్షతక్రింద అతివైభవముగా జరిగింది. కామ్రేడ్ ధరణిగోస్వామి కార్మిక-కర్షక జండాను ప్రతిష్టిస్తూ, ప్రపంచ పీడిత వర్గాలతో బాటు భారతదేశ రైతులుకూడా ఆ జండాక్రింద నిలబడి తమ దాస్యవిముక్తికి ఏవిధంగా పోరాటం సాగించాలో ఉపన్యసించాడు. ఈలోగా కొందరు రౌడీలు మహాసభ పెండాల్‌లో ప్రవేశించి, సభను భగ్నంచేసే ఉద్దేశంతో అల్లరి ప్రారంభించారు. ముజఫర్ అహమ్మదు విప్లవవాది కాబట్టి అతను అధ్యక్షుడుగా ఉండకూడదనీ; రావుబహద్దర్ శరత్‌చంద్రబాల్ అనే అతడు అధ్యక్షుడుగా ఉండాలనీ; పోలీసులు ప్రేక్షకరుసుము చెల్లించుకోకుండా లోనికి రానివ్వవలసిందనీ-ఆ రౌడీలు గోలచేయడం ప్రారంభించారు. తమ కోర్కెలను సభానిర్వాహకులు నెరవేర్చకపోతే సభను పాడుచేస్తాం అనికూడా బెదరించారు. ఆహ్వానసంఘ సభ్యులు వీరి బెదరింపులకు జంకక, సభాకార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుతున్నారు. కాని, యీరౌడీలు పెండాల్ బయటికివచ్చి, మరికొందరు రౌడీలతోను, పోలీసులతోను తిరిగి ప్రవేశించబోతూ వుంటే వాలంటీర్లు వెళ్ళనీయలేదు. ప్రేక్షకరుసుము చెల్లించకుండా పోలీసులు లోనికి వెళ్ళకూడదని ఆటంకపరిచారు. వెంటనే రౌడీలు 400 మంది యితర తుంటరులతో యీవలికి వచ్చి, డప్పులు వాయించడం, గోలచేయడం ప్రారంభించారు. "చక్రవర్తి చిరస్థాయి అగుగాక!" "విప్లవకారులు నశించుగాక!" మొదలైన నినాదాలతో అల్లరికి పూనుకున్నారు. వారిలో కొందరు లోనికి రాళ్ళుకూడా విసిరేరు. అనేకమందికి గాయాలు తగిలాయి. సభాధ్యక్షునికి కూడా తగిలాయి. మహాసభకు ప్రక్కనే ఒక కాలువవుంటే, దానిమీద వేయబడ్డ వంతెనను యీ తుంటరులు పీకివేశారు. ప్రేక్షకులకు యిబ్బంది కలిగించాలని వీరిఊహ. కాని, యీ ప్రయత్నాలన్నీ పూర్తిగా విఫలమయాయి. ప్రజలు శాంతంగాను, ఓపికతోను, కూర్చొని సభ పూర్తిఅయాక ఎవరి గ్రామాలకు వారు వెళ్ళిపోయారు.

పోలీసులు మాత్రం యీ రౌడీలయెడ సత్యాగ్రహ మొనర్చారు. తాము స్వయంగా చూచి కూడా వారిపై ఎట్టి చర్య తీసుకొనలేదు. పైగా కొన్ని సందర్భాలలో వారికి ప్రోత్సాహంకూడా యిచ్చారు. బెంగాల్‌లో నేడు అధికారంలో ఉన్నది కాంగ్రెసు ప్రతికూల మంత్రివర్గం అని మనం మరచిపోకూడదు. మహాసభకు వచ్చిన సుమారు 7000 మంది రైతులు, 2000 మంది స్త్రీలతో సహా, ఆ రోజున చూపిన శాంతం, ఓపిక, ప్రశంసార్హములు.

అధ్యక్షత వహించిన ముజఫర్ అహమ్మద్ తన అధ్యక్షోపన్యాసంలో బెంగాల్ రైతుల దుర్భరజీవితాన్ని గురించీ, దాని నివారణార్థం రైతుల కర్తవ్యాన్ని గురించీ ఉద్రేకపూరితంగా చెప్పాడు. ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య. జమీందారీ పద్ధతి నశింపు, రాజకీయ ఖైదీల విడుదల, మొదలైన విషయాలనుగురించిన తీర్మానాలు మహాసభలో ఏకగ్రీవంగా ఆమోదించబడ్డాయి.

బారిసాల్‌లోకూడా ఇదే కథ.

బారిసాల్ జిల్లాలో జోబర్‌సార్ అనే గ్రామం ఉంది. ఇతర గ్రామాల రైతుల మాదిరిగానే యిక్కడి రైతులు కూడా తినడానికి తిండి, కట్టుకోడానికి గుడ్డ లేక చెప్పరాని అనేక బాధలు పడుతున్నారు జిల్లా అధికారులయెదుట మొఱపెట్టుకోవడానికని జోబర్‌సార్ గ్రామ రైతులు బ్రహ్మాండమైన ఒక యాత్రాదళంగా ఏర్పడి, జిల్లా ప్రభుత్వాధికార్లవద్దకు కాలినడకను బయల్దేరారు తమ హక్కులకొరకు క్రమశిక్షణతో యాత్ర సాగిస్తున్న యీ పేద ప్రజల పట్టుదలను ఏ విధంగానైనా చెడగొట్టడానికి జిల్లా పోలీసు సూపరింటెండెంటు ఒక రిజర్వు పోలీసుదళంతో తయారయాడు. తక్షణం రైతులందరూ ఆ స్థలాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోవలసిందని ఆజ్ఞాపించాడు. కాని, రైతులు వారి నాయకులు నిరాకరించారు. తాము శాంతంగా రైతు యాత్రలో పాల్గొనడానికి సంపూర్ణమైన హక్కు ఉన్నదని తెలియ జేశారు. కాని ప్రభుత్వోద్యోగులు మాత్రం తమ పశుబలాన్ని ప్రదర్శించ దలచుకొన్నారు.

రైతుయాత్రకు నాయకత్వం వహించిన కామ్రేడ్స్ శిశిరగుప్తా, సుధీర్‌సేన్, అమూల్య చక్రవర్తి అను ముగ్గురు జిల్లా రైతుసంఘ నాయకుల్ని పోలీసులు నిర్దాక్షిణ్యంగా లాఠీలతో మోదారు. ఆస్పత్రిలో వీరు ప్రమాదకరమైన స్థితిలో ఉన్నారు.

బెంగాల్‌లో నేడు యిట్టి రౌడీ రాజ్యమే అనేక ప్రాంతాలలో తాండవ మాడుతోంది. అనేక గ్రామాలలో సాయుధ పోలీసులు అమాయక రైతులలో భయోత్పాతం కల్పించడానికి రాత్రింబగళ్లు కాపలా కాస్తున్నారు. తుంటరులను పురిగొల్పి, రైతు సభలలో అల్లరులు చేయిస్తున్నారు. కాని బెంగాల్ రైతులుమాత్రం తమ కనీసపు కోర్కెలకై జరుపు పోరాటం ఆపలేదు ఇనుమడించిన ఉత్సాహంతో, రైతు సంఘాల యాజమాన్యాన, సామ్రాజ్యవాదుల గులాములుగా ప్రవర్తిస్తున్న బెంగాల్ మంత్రివర్గంతో రైతులు శాంతియుతమై నపోరాటాన్ని సాగిస్తున్నారు. ఎన్నికలలో జయమొందడానికి రైతులవద్ద వోట్లు తీసుకొని, అధికార పదవులు వచ్చాక ఆ రైతుల్నే రౌడీలచేత, పోలీసులచేత కొట్టించడానికి వెనుదీయని జాతీయ ప్రతికూల పార్టీల బూటకత్వం నేడు రైతుల కండ్లయెదుట స్పష్టంగా బయల్పడుతోంది.

# అమ్మకపు పన్నుపై రంగాగారి ప్రకటన

యిన్నాళ్లనుండి వర్తకులే యీ పొగాకు తదితర అమ్మకాల శిస్తులపై వ్యతిరేక ప్రచారం తీవ్రంగా చేస్తుంటే మన రైతులు, కూలీలంతా తమకేమి ఫరవాలేదనుకున్నట్లున్నది. కాంగ్రెసు సంఘాలు, రైతుసంఘాలవారుకూడా యీశిస్తులను నిజంగా యెవ్వరు తుదకు భరించవలసి యుండునో విచారించకపోవుట విచారకరము. అందునూ, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు యీ శిస్తులను బలపరుస్తూతదితర సంఘాలవారికికూడా, అటులనే చేయవలసినదిగా సలహాయిచ్చి ప్రచారం చేయుచుండుట దురదృష్టము.

పైపైననే విచారిస్తే మాత్రం యీ శిస్తులను వర్తకులే చెల్లించుతారనితోచును. వడ్లు, వేరుశనగ, ప్రత్తి, పప్పుధాన్యాలు, వాటిని పండించి అమ్ముకొనే రైతులు సరాసరిగా యీ శిస్తు చెల్లించనక్కర లేదంటారు, రాజాజీగారు. వారు అమ్మితే కొన్న వర్తకులు, వారమ్మగా తిరిగి కొన్నవారు, వారినుండి భోజనాలకై కొనుక్కొన్న ప్రజలు, యీ శిస్తులను చెల్లించవలసి యుందురంటారు. కాని ఎవ్వరు ఎవ్వరిపై యీ వ్యాపారసరళిలో ఆధారపడి వున్నారో ముందుగా తెలుసుకోవాలి! ఎందులకా? ఎవ్వరు ఇతరులపై ఆధారపడక, స్వతంత్రించి తమ వస్తువులను తమ కిష్టమైన ధరలకే కొనమనియో, లేక అమ్మమనియో బలవంత పరచగలరో వారిపై యీశిస్తులు పడజాలవు.

మన ముడిధాన్యాల అమ్ముకోవలసిన రైతులకు ధనం అవసరం, కొనేవారు అవసరం. కాని దళారులైన ఖాయిదాదారులు రైతులపై పెత్తనం చేసేవారే! ఐ. యల్. టి. డి. కంపెనీల గిడ్డంగులకుపోతే, రైతులు గుంపులు గుంపులుగా తమ పొగాకు వేసుకొనివచ్చి, తమ తమ,సరకులను గిడ్డంగిలోనికి పోనివ్వాలనిం దని గుమస్తాలకు, లంచాలిచ్చి, బ్రతిమాలుట చూడండి; అటులనే వాల్కాటు, రాలీ, కంపెనీలపై ఆధారపడుచున్న రాయలసీమ, దక్షిణాది ప్రత్తి రైతులను గమనించండి. కన్యకా పరమేశ్వరీ ఆజ్ఞల ప్రకారం రైతులనుండి నిర్బంధముగా రాబట్టుకుంటున్న అనాధర్మాన్ని ఎదిరించలేక 166 పౌనులకు బదులు 176 పౌనుల వడ్లబస్తాలను తీసుకొని, వెనుకటి ధరలనే చెల్లించే వర్తకులను చదువుకొన్న తెనాలి, గుడివాడ మేటిరైతులే ఎదిరించలేకవుండడంచూడండి.

ఈనాటి అనుభవాన్ని చూతాము. అప్పుడే గుంటూరు, తెనాలి, రేపల్లె వర్తకులు తమ తమ శిస్తు చెల్లుబడి బాధ్యతలను పరస్పరంగా నిర్ణయించుకొని సాధ్యమైనంతవరకు పూర్తిగా యీ శిస్తులను రైతులనుండియే రాబట్టుకోవాలని తీర్మానించుకున్నారు. అంతియేకాదు, వసూలుచేయడము మొదలెట్టినారు, రేపల్లెలో వడ్లధరపై రూపాయికి నాలుగు దమ్మిడీల చొప్పున మినహాయించుకొనే, రైతులకు చెల్లించుచున్నారు. యింతకంటె సాక్ష్యము అవసరమున్నదా! కనుక యీ అమ్మకాలపన్ను ముడిధాన్యాల అమ్మకాలకు సంబంధించినంత వరకు రైతులపైననే అమితంగా పడుతుంది. పడుచున్నది. యిందుకేమి సందేహం లేదు.

యీ శిస్తులను రైతు లనుభవించగలరా? రాజాజీయైనా ఆమాట అనగలడా? ఏ సౌకర్యాలు రైతులకు కల్గించితిమని యీ కాంగ్రెసు ప్రభుత్వమీ ఐదుకోట్ల రూపాయల నూతన శిస్తులను కూలీ రైతులపై వేయుట? భూమిశిస్తు ఎనిమిది కోట్లలో 75 లక్షలవరకేగదా తగ్గించిరి! యిది కాంగ్రెసు ధర్మానికి, ప్రజారక్షణకు భంగకరముగాదా? ఎటుజూచినా యీ శిస్తుల నే జాతీయవాదియు, ప్రజాహితైషియు అంగీకరింపజాలడు.

* * *

## లంచ మివ్వని రైతు ఏమి చెయ్యాలి?

శ్రీ కానూరి చిన వెంకట దాసయ్యగారు యిట్లు వ్రాయుచున్నారు.

బందరు తాలూకా పురివి గ్రామములో రీ సర్వే నెం. 314—1రు య 8—77 ట్లు పాల అక్కుళ్ళ వరికోసి పనమీద బడగా గాలివానవల్ల కొట్టుకుపోయి, మురిగిపోయి పూర్తిగా నష్టమైనది. నెం. 314/2 రు య 19—27 ట్లు మూడు వందలు గవర్నమెంటు వంకసన్నము వరి పాలు పోసుకొను సమయమున కురచ పైరు అగుటవల్ల గాలి దెబ్బచేత రాలిపోవుట, అవిసిపోవుట, తాలు అగుట తటస్థించినది. తతిమ్మాది 24 నెంబరు వగైరా పైరు వలచన కురచ యగుటవల్ల అదును తప్పి భూమిని అంటుకుపోయి కొయ్యకుండానే వదలిపెట్టుట కొంత గింజ రాలిపోవుట జరిగినది. ప్రభుత్వంవారి తనిఖీనిమిత్తం గింజ రాలిపోగా మిగిలిన పంట కుప్పలు జనవరి ఆఖరువరకు నిల్వా వుంచితిమి. తహస్సీల్‌దారుగారు ఒక రోజున రోడ్డువెంబడి బండిమీద గ్రామములోకి వెళ్ళుచూ సదరు భూములలోని కుప్పలు ధాన్యంమెన్ని అవును అనివెంటవున్న గ్రామస్థులనుఅడగగా కొందరు మూడుపుట్లు అవునని, మరికొందరు పదిపుట్లు అవునని చెప్పిరి. మునసబుగారు ఎనిమిదిపుట్లు అవుతవని చెప్పినట్లున్నది, పనమీద నష్టమునుగురించికూడా సంభాషణ జరిగినదని చెన్నూను వగైరా గ్రామస్థులు తాము చూచిన విషయమును చెప్పినారు. జనవరిలో నాతాలూకు మనుష్యులు కరణంగారితో రిమిషన్ సంగతులు అడుగగా గ్రామములో య 1కి రూపాయి చొ॥ వసూలు చేయుచున్నారు; మీసంగతికూడా ఆలోచించుకోవలసినదని చెప్పిరి. దరిమిలా నా కుమారునకు కబురు చేసి తాలూకా నుండి జమాను వచ్చినాడు. ఈ పూట డబ్బు యివ్వమని అడుగుటయు, డబ్బు యివ్వను అని చెప్పుటయు జరిగిన తర్వాత తనే కపుతరం నాకు కబురంపినాడు షుమారు 8 మాసముల నుండి జబ్బుస్థితిలో ఉన్న నేను ప్రయాణము చేయు స్థితిలో లేని కారణమువల్ల తాలూకా తహశ్శీల్‌దారుగారికి 4—2—39, 20—2—39 తారీఖుల రిమిషన్ ఇప్పించవలసినదని, సదరు భూములకు యీ ఫసలీలో రు 1338—0—0 రూపాయలు వ్యవసాయమునకు ఖర్చుపెట్టి యున్నాననియు, అప్పుతెచ్చిన వివరం తెలుపుతు పంటసంగతి, పశువుల నష్టం, పాకలనష్టం వగైరా తెలుపుకుంటిని. 3—3—39 న జమా బందీ ఆఫీసరు గారికి పనమీద పంటనష్టము, గాలి దెబ్బవల్ల పైరు నష్టములు తెలుపుతూ రిమిషను యిప్పించవలసినదిగా పిటిషన్ పెట్టించితిని. 28-2-39, 8-3-39 జిల్లా కలెక్టరుగారికి కూడా రిమిషన్ యిప్పించవలసినదని గ్రామ మునసబుగారి జప్తులు మొదలైన సంగతులు గురించి అర్జీ పంపుకొని యున్నాను కాబట్టి (1) నా భూములకు చుట్టూ ఉన్న భూములకు రిమిషన్ యిచ్చియు, నా భూములకుమాత్రమే రిమిషన్ యివ్వకపోవుట. (2) పనమీద నష్టమైన భూమికి రిమిషన్ యివ్వకపోవుట. (3) పెట్టిన ఖర్చు పండినపంటను బట్టి రిమిషన్ యివ్వకపోవుట మొదలైన రైతు సంఘముల, కాంగ్రెసు సంఘముల, కర్తవ్యమును గురించి మనయొక్క పర్యాయము తెలుపుకొనుచున్నాను.

## ఆంధ్ర దేశంలో

# జాతీయవాంఛా తీర్మాన ప్రచారం

అఖిలభారత కాంగ్రెసు మహాసభచే గావింప బడిన జాతీయవాంఛాతీర్మానమును ప్రజలలో ప్రబోధముచేయుటకు నెల్లూరుజిల్లా కాంగ్రెసు కమిటీ, జిల్లాసోషలిస్టుపార్టీ యాజమాన్యమున కామ్రేడ్సు, బి. శంకరయ్య, యస్. శంకరయ్య, డి. అక్కయ్యగార్లతో కూడిన ఒక దళము ది 10—4—39 వ తేదీ లగాయతు, 25—4—39 వరకు కావలి కందుకూరు తాలూకాలలోని 28 రైత్వారీగ్రామాలు 9 శ్రోత్రియందారీగ్రామాలు, 2 జమీందారీగ్రామాలలో పర్యటనం గావించినది. సభలలో సుమారు 2100 మంది ప్రజలు పాల్గొనిరి. వారిలో ఒక భాగము కూలీలు; రెండుభాగములు రైతులు గలరు. మొత్తంలో 4 వంతులు స్త్రీలు హాజరైనారు.

సభలలో బ్రిటిషు ప్రభుత్వము భారతీయసంపదను హరించుచు, మనలను బానిసత్వములోను దారిద్ర్యములోను ముంచిన విధమును గురించియు, దానినుండి విముక్తి చెందుటకు కాంగ్రెసుపనిచేయుచున్నదనియు, బ్రిటిషుప్రభుత్వము తొలగిపోనిదే మనకష్టాలన్నీ గట్టెక్కవనియు, తమ తమ స్థానికయిబ్బందులను తొలగించుకొనుటకు అందరు తమ తమ సంఘాలను కాంగ్రెసుకమిటీలను, ఏర్పరచుకొని వాటిద్వారా తమ యిబ్బందులను నివారణచేసుకొనుటకు ప్రయత్నములు చేయవలసినదనియు ఉపన్యాసములివ్వబడినవి.

మన దేశములో ఫెడరేషన్‌ను అమలు జరుపాలని, మన సంపదనంతా వచ్చే యుద్ధములో తన స్వలాభాలకై వినియోగించుకోవాలని బ్రిటిషు ప్రభుత్వం ప్రయత్నం చేస్తోందనియు, దాన్ని ఎదుర్కొని, స్వాతంత్ర్యము సంపాదించాలనియు వివరింపబడినది.

యీ స్వరాజ్యం సంపాదించాలంటే ప్రతి గ్రామమందును ఐకమత్యం అత్యం అవసరం. రిగను రైతులు కూలీలకు సరియగు కొలతపాత్రలతో కూలి ఇచ్చి, వెట్టి చాకిరీ చేయించక, ఎనిమిదిఅణాలకు మించని వడ్డీ ఏర్పాటుచేసి రైతు, కూలీల సామరస్యమును పెంపొందించి, తమ సౌఖ్యముల నింకను వృద్ధిచేసుకొనుచు బ్రిటిషు ప్రభుత్వముతో ఏమీ సంబంధములేని సంపూర్ణ స్వరాజ్యమునకై పోరాడుటకు సిద్ధము గావలసినదని స్పష్టముగా తెలుపబడింది. బ్రిటిషు ప్రభుత్వానికి అండగా నిలచి ఉన్న జమీందారీ, శ్రోత్రియందారీ పద్ధతివలన ప్రజలు పడుచున్న బాధలను ప్రకాశం కమిటీ రిపోర్టు ప్రకారం వచ్చే బిల్లు కొంతవరకు తొలగించుననియు, కాని ఆ పద్ధతిని పరిపాలనతో కూడ పూర్తిగా రద్దుచేసిననాడే రైతులకు పూర్తిగా లాభము వస్తుందని వివరింపబడింది.

ఈ సంచారంలో 3 రష్యా సంచికలు, 8 త్రిపురీ సంచికలు, కమ్యూనిస్టులు కోరేదేమిటి? 12, రైతుసంఘ నిబంధనలు 8, అమ్మబడినవి: నవశక్తికి 3 రు చందాదారులుగా చేర్చబడ్డారు.

ఉపన్యాసములలోని లోపములు.

1. సోవియట్ రష్యాను యితర రిపబ్లిక్ దేశాలతో పోల్చి చెప్పడమేగాని సోవియట్ రష్యాలో నిరుద్యోగములేదని మరి యేదేశములో కూడా లేని సౌకర్యాలు రైతులకు, కూలీలకు ఉన్నవని చెప్పకుండడము.

2. రైతు, కూలీ సంఘముల ఆవశ్యకత, పై సంఘాలు కాంగ్రెసును యే విధముగా బలపరచవలసినది వివరించకుండుట.

3. సమ్మరు స్కూలు విషయము చాల చోట్ల ఉపన్యాసములలో చెప్పకుండడము.

మొత్తము ప్రోగ్రాము ఖర్చులు.

| | |
|---|---|
| పోస్టేజీ, తెల్ల కాగితాలు | 0—13—0 |
| జండాలు కార్పను పేపర్లు | 1—1—6 |
| భోజనపు ఖర్చులు | 1—5—6 |
| (కొన్నిచోట్ల పూట కూలి తినవలసివచ్చింది) | |
| అల్లూరులో మీటింగు ఏర్పాటుఖర్చు | 0—3—6 |
| | 3—7—6 |

ఈ సంచారము సందర్భములో ఈ దిగువ గ్రామాలలోని ప్రజలు మా ఎదుట తమ బాధలను వెళ్ళబోసుకొనిరి.

### 18 వ తేదీ

18 వ తేదీ సాయంత్రం సాయపేటలో సభ జరిగింది. సభకు షుమారు 200 మంది హాజరయారు. సభలో జాతీయ వాంఛ తీర్మానముపైన, యుద్ధముపైన ఉపన్యాసము లివ్వబడినవి.

### 19 వ తేది

కందుకూరు తాలూకా. అన్నబోయినపల్లి.

ఇక్కడ 19 వ తేదీన సభ జరిగింది. సుమారు 50 మంది ప్రజలు హాజరయారు. రైతు పాటలు, నేషనల్ డిమాండుపై ఉపన్యాసములు పూర్తి అయిన పిదప గ్రామస్థులు తమయిబ్బందులను ఈవిధంగా చెప్పుకున్నారు.

"మా గ్రామములో 22 రిపై సి. టి అస్టు ఉన్నది. అందు 20 మంది నిర్దోషులు. ఈ పూరి గ్రామ మునసబు ఇంకొక గ్రామానికికూడ మునసబుగా నున్నారు వారి మకాం రెండవ గ్రామంలో నున్నది. అందుచే ప్రతిరోజూ పై 22 మంది ఆ గ్రామం పోవలెను. మునసబు గారు గ్రామాంతరమున నున్ననాడు వారు రాత్రి అంతయు మునసబుగారి గ్రామంలోనే ఉండవలసి వచ్చుచున్నది. వీరు ఏదైన కారణము వలన యితర గ్రామాలకు పోవలె నన్న "ప్యాసు"లు ఇవ్వక అధికారులు వీరిని ఇబ్బంది పెట్టుచున్నారు. గ్రామ తలారియు, పోలీసులు లంచాలు యివ్వకున్నచో గైర్ హాజరు వేసి బాధలు పెట్టుచున్నారు.

"ఇదివరలో చెల్లించిన శిస్తులకు రశీదులు ఇవ్వక ఎస్టేటు అధికారులు సొమ్ము అపహరించినారు. ఇప్పుడీ ఎస్టేటు కోర్టు ఆఫ్ వార్డ్సు క్రిందకు వచ్చినది. శిస్తు బకాయిలకు చాల మంది రైతులపై గవర్నమెంటువారు దావాలు చేసినారు" అని మొరబెట్టినారు. అందుపై "కాంగ్రెసు సంఘం పెట్టుకొని దాని ద్వారా ఈ యిబ్బందులు పోగొట్టు కోడానికి ప్రయత్నం చేయండి" అని మేము వారికి సలహాయిచ్చి ఇంకొక గ్రామానికి పోయాము. వెల్లటూరిపాలెం వెళ్ళి ప్రబోధించాము కాంగ్రెస్‌లోచేరమని.

19 వ తేది సాయంత్రం పాల్లపల్లి గ్రామం చేరుకొంటిమి. "యీ గ్రామము చిరపాని రాజాగారిది: 6 సంవత్సరములనుండి పుల్లరి ఎక్కువచేసి జమీందారు రైతులను అనేకబాధలు పెట్టుచున్నారు. పచ్చలేక మేతమేయుట వీలులేని పశువును దొడ్డిలో కట్టివేసుకొనినను అధికారులు దానికికూడ పుల్లరి కట్టినారు. పూర్వము గ్రామస్థులు కాపురమున్న ఇండ్లస్థలములలో మెట్టపైరులు వేసుకొనగా యకరాకు 18—12—0 శిస్తు విధించినారు. పోరంబోకులలో గడ్డివామును వేసుకొనినను ఇదే రేటు వసూలు చేస్తున్నారు. బావులు పూడిపోయిన తోటలలో మెట్టపైరులువేసుకొనినను యకరాకు 16 రూపాయిలు శిస్తు విధించుచున్నారు. వీటిని గూర్చి స్థానికశాఖామంత్రిగారికి అర్జీపూర్వకముగా విన్నవించుకొన్నాము. దీనిపై జమీందారు గ్రామస్థులపై మరింత మండిపడి బాధలు ఇంకా ఎక్కువచేసెదనని బెదరించుచున్నారు. ఈ గ్రామంలోని రెండుబావులలో ఒకటి పాడయిపోయినది." అని గ్రామస్థులు మాతో చెప్పారు. ఆ సాయంత్రం గ్రామంలో సభపెట్టగా సుమారు 200 మంది ప్రజలు వచ్చారు. సాయపేటనుండి కొందరు రైతులు కూడా వచ్చారు. అందు ఒక రైతు తాను వేసిన ముదటిపైరు పాడవుటచే రెండవపర్యాయం పైరువేసి తిననియు, అందుపై కరణం, రెండు కాదులు పండించినట్లు రిపోర్టు చేసెననియు, జమాబందీ ఆఫీసరుకు యీ విషయమై తాను తెలియజేయగా రిపోర్టులేదని చెప్పి తరువాత రెండు కారులకు శిస్తు చెల్లించవలసినదని తనను నిర్బంధ పెట్టుచున్నారనియు "తెలియజేశాడు. ఇందునుగూర్చి జిల్లా కలెక్టరుకు అర్జీ పెట్టుకొనమని మేము చెప్పాము.

### 20 వ తేది

20—4—39 తేదీ ఉదయం 7 గంటలకు లింగనపాలెం చేరి గ్రామచావడి వద్ద సభపెట్టగా 20 మంది రైతులు వచ్చిరి. రైతు పాటలు పాడిన పిమ్మట బి. శంకరయ్య భారత స్వాతంత్ర్యమును గురించి ఉపన్యాసమిచ్చెను, సభానంతరం,

అచ్చటి రైతులు తమ బాధలు చెప్పిరి. యీ గ్రామం పెదపవనిరాజాగారిది. యీ రాజా గారు పన్ను అధికంగావసూలుచేస్తూయున్నాడు. చెరువు మరమ్మతు చేయించలేదు. గడ్డివాములు వేసుకొనే స్థలానికి యకరా 1 కి 18-12-0లు సిస్తు వసూలుచేయుచున్నారు. యీగ్రామంలో స్కూలులేదు"అనిరి. ప్రకాశం రిపోర్టు ననుసరించి బిల్లు తొందరలో చేసెదరనియూ బిల్లు అమలులోకి వచ్చిన పై యిబ్బందులన్నియూ తొలగుననియూ స్కూలుకు జిల్లాబోర్డుకు అర్జీ పెట్టుకొనవలసినదనియూ తెలియజేసితిమి. 9 ఘంటలకు పెరిగిపాలెం వచ్చితిమి. 11 ఘంటలకు గ్రామమంతయు రైతుపాటలతో తిరిగి మీటింగుపెట్టగా 15 మంది రైతులు వచ్చిరి.

20—4—39 సాయంత్రం 6 ఘంటలకు కృష్ణారెడ్డిపాలెం వెళ్లి 8 ఘంటలకు గ్రామమంతయూ కూలి రైతుపాటలతో తిరిగి దేవాలయమువద్ద మీటింగు పెట్టగా స్త్రీలు పురుషులు కలసి 20 మంది వచ్చిరి. రైతుగీతాలు అయిన పిమ్మట నేషనల్ డిమాండు తీర్మానము సవిస్తరముగా వివరింపబడెను.

### 21 వ తేది

21—4—39 ఉదయం 9 ఘంటలకు పొలంపాడుచేరి మధ్యాహ్నం 1 ఘంటకు గ్రామచావడివద్ద మీటింగు పెట్టగా 10 మందివచ్చిరి. అక్కడ సభ జరిగెను.

సాయంత్రం ఘం 6 లకు కాకుటూరుచేరి గ్రామములో ఊరేగింపు జరిపి చావడివద్ద మీటింగు పెట్టగా కాకుటూరు వారున్నూ దానివారువారైన జక్రివారిపాలెం, తిమ్మారెడ్డిపాలెం, బాదంపాలెం గ్రామాలరైతులు 100 మంది సభకు వచ్చిరి. రైతుగీతాలుపాడిన పిమ్మట బి. శంకరయ్య నేషనల్‌డిమాండు తీర్మానమును వివరించెను. సభ ముగించిన తర్వాత అచ్చటి రైతులు తమబాధలు వివరించిరి. "యీ గ్రామాలన్నీ శ్రోత్రియందార్లవి. జక్రవారిపాలెం వాస్తవ్యులైన వొద్దినీడి యర్రియ్య అనే రైతుకు సర్వేనెంబరు 670/6 లో యకరాలు 2—93 సెంట్లు ఉండెను. యకరా 1 కి రు 4—8—0 సిస్తు యింతకు ముందు చెల్లించుచుండెను. యీ సంవత్సరము రూ 8—5—0 లెక్కన కట్టమని లేకున్న దావా జేసెదననీ జమీందారు నోటీసు యిచ్చియున్నాడట. గ్రామములోని పచ్చికబీళ్ళకు ప్రత్యేకపుల్లరితీసికొనుచూ పశువును ఉంచుకొన్నందుకుగా పశువు 1 కి రూ 0—8—0 పొలములేని కూలీలకు సశువులువున్నచో పశువు 1 కి రూ 1—0—0 పడక పుల్లరి తీసుకొనుచున్నారు. 14 సంవత్సరముల నుండి చెరువు మరమ్మతులేదనియూ రైతుల పట్టాపొలములో నున్న చెట్లను మలగొట్టినాడనియూ, బొత్తిగాపండని పొలమునకు శిస్తులు ముజరా యిచ్చుటలేదనియూ" తెలియజేసిరి. జిల్లాకాంగ్రెసుకు ప్రకాశంగారికి అర్జీలు పెట్టుకొనవలసినదనియు, ప్రకాశంగారు పెట్టబోవు ల్యాండురివెన్యూ ఆక్టులో శ్రోత్రియాలను కూడా కలిపిన పై బాధలు చాలావరకు తగ్గుననియూ చెప్పిన పిమ్మట సభ ముగింపబడెను.

### 22 వ తేది

22—4—39 తేదీ ఉదయం ఘం 6 కు తిమ్మ సముద్రముచేరి జాతీయజెండాపాటలతో గ్రామమంతయు తిరిగి రచ్చవద్ద మీటింగు పెట్టగా 100 మంది వచ్చిరి. మధ్యాహ్నం 12 గంటలకు అన్నవరం చేరితిమి. అక్కడ కూడా సభపెట్టగా 30 మంది వచ్చిరి.

సాయంత్రము 6 గంటలకు బ్రాహ్మణ కాక చేరి 8 గంటలకు గ్రామమంతయూ జండా పాటలతో తిరిగి గ్రామ మధ్యమున మీటింగు పెట్టగా 100 మంది వచ్చిరి. రైతు గీతాలు పాడిన పిమ్మట బి. శంకరయ్య నేషనల్ డిమాండు తీర్మానమును మనము వెంటనే సంపాదించవలసిన కోర్కెలకై చేయవలసిన పని, చక్కగా సూచించుచు ఉపన్యసించిరి. పిమ్మట గ్రామస్థులు, కాంగ్రెసు పరిపాలనలో నున్న ఆ జిల్లాబోర్డువారు వ్యక్తిగత కక్షలతో తమ గ్రామములో నున్న హాస్పి



టలును యెత్తివేయుటకు చేస్తూన్న ఆలోచనలను గురించి తెలియజేశారు. తర్వాత బి. శంకరయ్యగారు గ్రామ జనాభాను వారి పంచాయితీ బోర్డు హాస్పిటల్‌కు యిచ్చు విరాళమును విచారించి మీ గ్రామమునకు హాస్పిటల్ అవసరమేననియు మీ గ్రామ కాంగ్రెసు సంఘముద్వారా జిల్లా కాంగ్రెసుకు, జిల్లా బోర్డుకు అర్జీలు పంపవలసినదనియు నేను జిల్లాకాంగ్రెసు మెంబరుగా నున్నానుగాన అచ్చట మీ తీర్మానమునుగురించి మాట్లాడి పైతీర్మానము కాంగ్రెసు పరిపాలనలో యున్న లోకల్ బోర్డులను అజమాయిషీ చేయుటకు నియమింపబడియున్న కళా వెంకట్రావుగారికి పంపేటట్లు చూచెదనని చెప్పెను. పిమ్మట సభ ముగింపబడెను.

### 23 వ తేది

తే 23-4-39 ది వుదయం సోమవరప్పాడు చేరి మధ్యాహ్నం 12 గంటలకు మీటింగు పెట్టగా 10 మందియే వచ్చిరి. సభ జరిగెను.

ఆ సాయంత్రం 8 గంటలకు పాత బిట్రగుంట చేరి జెండాపాటలతో గ్రామమంతయు తిరిగి దేవాలయంవద్ద మీటింగు పెట్టగా 60 మంది వచ్చిరి. ఆనాడు యుద్ధ వ్యతిరేకసభలను జరపమని కాంగ్రెసు అధ్యక్షుడు ప్రకటించుటచే యుద్ధము వచ్చినట్లయిన పన్నుల నిరాకరణ, రైల్వే కూలీల సమ్మె చేయవలెనని చెప్పిన పిమ్మట సభ ముగింపబడెను.

### 24 వ తేది

24-4-39 తేది వుదయం 7 గంటలకు "కన్నవతలలో" మీటింగు పెట్టగా 10 మంది వచ్చిరి. బి. శంకరయ్య కాంగ్రెసులో చేరవలసిన ఆవశ్యకతను గురించి చెప్పెను. పిమ్మట సభ ముగింపబడెను

ఆ సాయంత్రం 6 గంటలకు బోగోల్లులో మీటింగు పెట్టగా 50 మంది వచ్చిరి. డి. అక్కయ్య రైతు గీతాలు పాడిన పిమ్మట ఆ గ్రామవాస్తవ్యులైన యమ్. వెంకయ్య, బి. వి. కృష్ణయ్యగార్లు ఫెడరేషన్‌ను గురించి, యుద్ధములను గురించి మాట్లాడిన పిమ్మట బి. శంకరయ్య నేషనల్ డిమాండు తీర్మానమును విశదీకరించిన పిమ్మట సభ ముగింపబడెను.

### 25 వ తేది

తే 25-4-39 వుదయం 6 గంటలకు వులవపాలెం చేరి మీటింగు పెట్టగా 30 మంది వచ్చిరి.

ఇలా ప్రచారం చేసి ఆయా గ్రామస్థుల ఇబ్బందులను కనుగొని వాటిని పోగొట్టుకొను మార్గములు సూచించి 25 వ తేదీని తాత్కాలికముగా సంచారం ముగింపు గావించితిమి అని కామ్రేడ్ బి. శంకరయ్యగారు తెలియజేయుచున్నారు.

## పశ్చిమ గోదావరి జిల్లా

భీమవరం తాలూకా కాంగ్రెసు కమిటీ, కాంగ్రెసు సోషలిస్టుపార్టీల యాజమాన్యమున కామ్రేడ్స్ మైలవరపు రామారావు, కృత్తివెంటి వెంకటేశ్వరరావు, గొట్టుముక్కల రామచంద్రరాజు, కొల్లా వెంకటరత్నం, గంధం రామారావు, బోడపాటి పోలిశెట్టి, దర్భా శ్రీరామమూర్తిగార్లు ది 26-4-39 వ తేదీని భీమవరం నుండి బయలుదేరి, వేంపాడు, కోపల్లె, బొండాద, జక్కరం చిన పుల్లేరు, సీసలి, కోలనపల్లి, దొడ్డనపూడి, కాళ్ళకూరు, జువ్వలపాలెం, ప్రాతర్లమెరక, యేలూరుపాడు మొదలగు గ్రామాలలో త్రిపురీ కాంగ్రెసుచే ఆమోదింపబడిన జాతీయ వాంఛా తీర్మానమును గురించి, ప్రపంచయుద్ధం వచ్చే పరిస్థితులలో మన కర్తవ్యాన్ని గురించి ప్రచారంచేసి 1 వ తేదీ సాయంకాలానికి భీమవరం చేరుకొనిరి. తిరిగి 3, 4 రోజులలో మిగతా గ్రామాలలో ప్రచారార్థం బయలుదేర నున్నారు. అని దర్భా శ్రీరామమూర్తిగారు తెలియజేయుచున్నారు.

## చిత్తూరు జిల్లా

కామ్రేడ్స్ యస్. నారాయణ, ఆర్. యం. రత్నం, వి. యన్. కె. పాణి, డి. శ్రీరాములుగార్లు ది 21 వ తేదీనుండి చిత్తూరుజిల్లాలోని దిగువ గ్రామాలలో పార్టీ ప్రచారమును గావించినారు. అక్కడ ప్రజలు పడుచున్న కష్టములను, వారుపోగొట్టుకొనుటకు సలహాలనిచ్చిరి.

కాయం, సురేంద్రనగరం, వల్లిపట్టు, నొచ్చిలి, రాచపాళెం, కత్తిరిపల్లి, బసివిరెడ్డిపల్లి, కొత్తపల్లి గ్రామాలలో ప్రచారంచేసి 27 వ తేదీకి చిత్తూరు చేరుకొనిరి. కొత్తపల్లిలో హరిజనులు త్రాగుటకు నీరులేక బాధలుపడుచున్నారు, అని ఆర్. యం. రత్నంగారు తెలుపుచున్నారు

# గ్రంథావలోకనం

## క్రాంతి గీతాలు

సంపాదకుడు:—గద్దె లింగయ్య.

దొరికేచోటు:— ఆదర్శ గ్రంథమండలి, ఎలమర్రు, కృష్ణాజిల్లా.

92 పేజీలు:—వెల నాల్గణాలు.

*

ప్రభ పత్రికా ప్రచురణకాలంలోనే లింగయ్యగారు, పద్యాలలో నూతనత్వానికి ప్రోత్సాహమిచ్చారు. జనసామాన్యానికి అర్థమయేటట్లు జనసామాన్యానికి అవసరమైన పాటలు పద్యాలను పత్రికలో ప్రకటించారు. నేడు మళ్లా క్రాంతిగీతాలను, వివిధపత్రికలనుండి స్వీకరించి ప్రకటించారు. నేటి సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారానికి, కార్మిక కర్షక ప్రచారానికి ప్రసిద్ధ రచయితల ఈ గీతాలు చాలా అవసరం.

పుస్తకం ముద్రణలోను, గెటప్‌లోనూ ఇంకా శ్రద్ధతీసుకోవాలి.

* * *

## మన సంపద

రచయిత:—క్రొపాటికిన్.

అనువాదకుడు:—గద్దె లింగయ్య.

దొరికేచోటు:—ఆదర్శగ్రంథమండలి,

20 పేజీలు:—అణా.

క్రొపాటికిన్ వ్రాసిన "కాంక్వెష్టు ఆఫ్ ది బ్రెడ్" అనే గ్రంథంలోని ఒక ప్రకరణానికిది అనువాదం, మన సంఘం ఎలా పరివర్తన మొందినదీ, నేడు ఎట్లు పెట్టుబడిదారుల సంఘముగామారినదీ, పెట్టుబడి శ్రామికుల యధీనంలో ఎందుకుంచవలసినదీ, హృదయావేదన వెల్లడిస్తూ, ఉత్తేజకరంగా వ్రాసాడు. అనువాదం, సరళంగాను, మాతృకలోని ఉద్వేగాన్ని, పోగొట్టకను ఉన్నది, అందరూ చదివి నేర్చుకోదగిన విషయాలెన్నో ఈచిన్నికరపత్రంలో ఉన్నాయి.

* * *

## హిట్లరు దురంతాలు

రచయిత:—ప్రతాప రామసుబ్బయ్య

దొరకే చోటు:—అతివాద గ్రంథమండలి, గుంటూరు.

180 పేజీలు:—అర్ధరూపాయి

*

నాజీ ఉద్య మారంభంతో ప్రారంభించి హిట్లరు 1933 లో అధికార స్వీకరణ మొదలు కొని, 'చెకొస్లోవేకియా'లోని సూడెటెన్ ప్రాంత ఆక్రమణవరకు జర్మనీ నాజీజం గావించిన దారుణకృత్యాలు ఇందు వర్ణింపబడ్డాయి. తుది అధ్యాయంలో (ప్రపంచ శాంతి) ఫాసిస్టు దోపిడి గాంద్ర నరికట్టడానికి "స్వాతంత్ర్య భారత దేశమే శాంతిస్థాపనకై కంకణం కట్టుకొన్న సోవియట్ రష్యా నాయకత్వం క్రింద బ్రిటన్, ఫ్రాంసు మొదలయిన దేశాలతో కలసి, (ఫేసిస్టులపైన) యుద్ధం చేస్తుంది," అని చక్కగా ముగించారు.

పుస్తకం శీర్షిక చూచేసరికి 'హిట్లర్' అనే వ్యక్తి ఒకడు చేసిన దురంతాలా అని భ్రమకల్గవచ్చు. సాధారణంగా, హిట్లర్‌ను గాని, ముసోలినీని గాని, వారి సిద్ధాంతాల ననుసరించి విమర్శించక చాలమంది వ్యక్తిగతంగా పొగడటమో, తెగడటమో, మన పత్రికలలో చూస్తున్నాం. హిట్లర్ వ్యక్తిగతంగా మాంసాహారి కాకపోవచ్చు, బ్రహ్మచారే కావచ్చు. 'అహింసాత్మకం'గా ఆస్ట్రియా, జెకొస్లోవేకియాలను కాజేసియుండవచ్చు. కాని అతనిచేష్టలు, అతని సిద్ధాంతం నాజీజం, మరో ప్రపంచయుద్ధానికి, విజ్ఞాన వినాశనానికీ, ప్రపంచ అశాంతికీ దారి తీస్తున్నది. ఈ విషయాన్ని గ్రహించక చాలమంది హిట్లర్ ముసోలినీల పొగడటం చూస్తున్నాం.

రామ సుబ్బయ్యగారు, హిట్లర్‌ను వ్యక్తిగత దృక్పథముతో చూడక, అతని సిద్ధాంతాలను చర్చించి, నాజీజం ప్రపంచ యశాంతికీ, విజ్ఞాన వినాశానికీ, ఎలా దారి తీసిందో, ఎందరెందరు స్వాతంత్ర యోధులు ఈ నాజీ పిశాచత్వం క్రింద బలి అయ్యారో, హృదయం కరిగేటట్లు, ప్రతి ప్రజాస్వామ్య ప్రియుడూ, శాంతి కాముకుడూ, హిట్లర్‌నూ, నాజిజాన్ని గర్హించేటట్లు వ్రాశారు. అంతర్జాతీయ పరిసితులు విషమించుచున్న ఈ రోజులలో, ఈ గ్రంథం చదివి చాలా విషయాలు తెలుసుకోడం అవుసరం.

* * *

## నీటి బుగ్గలు

రచయిత:—బిట్రకంటి రామచంద్రుడు.

దొరికేచోటు:— చాతక గ్రంథమాల, అనంతపురం.

44 పేజీలు:— వెల తెలియదు.

*

ఇదొక ఖండ కావ్యం. ఉడుకు, ???, ఏది మెట్లో, ధమాసవట, అప్పుడు, పందెమోడితిని, నిరాశ, అనుభవమున్న వినుము, ఏడ్చుటకు రాక, విషాదజటిలము, ఎదమొద్దవారినది, అమృతంపువెల, తృష్ణ, అంతర్వాణి, ఉషః ప్రార్థన, ఇద్దరము, సాక్షి, మేర, నాడు—నేడు, మృత్యువెదురైన, ప్రణయింపుటరి, ఎప్పుడు ఎవ్వరు, వదలిపోవా పిశాచి, సిగ్గు, సిగ్గు, తాతా వినవోయ్, నైజమో, నీటిబుగ్గలు అను శీర్షికల క్రింద పద్యాలున్నాయి.

పద్యాలు సరళంగానడుస్తున్నాయి. అంతటా గాకపోయినా, అచ్చటచ్చట "రేషనలిస్టు" భావాలుకొన్ని వీరి కవిత్వంలో చొరబడ్డాయి. ఉదాహరణకు,

"చచ్చిపోయిన వెనుక
ఎచ్చటో నరకమట
పచ్చి నరకమ మనకు
ఇచ్చటే లేనట్టు"

అని అన్నారు.

మరొక చోట,

"రండహో! ఆత్మ సంతుష్టులార రండు!
పొగల సెగల నొడళ్ళలో మిగిలియున్న
మూడు రక్తపు బొట్లింకిపోవ
యంత్రశాలల బరిశ్రమించు
'కూలీల' మేని చమట కంపులు
ముక్కు రంధ్రముల కెక్కి
తలకు దిమ్మ వట్టించుచోటులకు రండు!
దేవుడు దయామయుండని తేల్చి పొండు!"

అని కార్మికుల దైన్యావస్థను తెలుపుటేగాక అంతా 'దేవుడిదయ' అని తలచేవారిని 'ఛాలెంజి' చేశారు.

యువకుల కద్దు రావద్దంటూ తాతతో

"మాలో మండెడు
జ్వాలలో కప్పుడు
మీలో కూడా వెలిగినవే?
మీలో నుండీ
మాలో జొచ్చెను
ప్రకృతి శక్తు: లిక
బాధ్యత మాదే"

అని అన్నారు. ఇలా అచ్చటచ్చటా అభివృద్ధి వాఙ్మయానికి తోడ్పడే పద్యఘటనకలు కన్పించుచున్నాయి. సంతోషింపదగ్గ విషయం, నేటి సంఘంలో పతితజీవితాన్ని, దుఃఖజీవితాన్ని చిత్రించాలి కవి ఇక ముందు. ఇది మా ఆశ.

"ఎడతెగని కఱవున బడ్డ రాయలసీమ" ప్రథమచాతకం ఇది. మాకఖండవృష్టి కురిసే లక్షణాలున్నాయి." అని ప్రకాశకులన్నారు. ఇది రాయలసీమవారే గాక తదితరాంధ్రులంతా సంతోషింపదగిన విషయం. ఇట్టి ప్రయత్నానికి ఆంధ్రులందరూ చేయూత నిచ్చి ప్రోత్సహించాలని గూడ కోరిక.

* * *

## స్వీకారము

### ఆకలి మంటలు

రచయిత:—కామ్రేడ్. శెట్టిపల్లి.

పుస్తకాలకు:—రైతాంగ గ్రంథమాల, గుడివాడ.

* * *

### బడ దీదీ

రచయిత: శరత్చంద్ర చటర్జీ.

అనువాదకులు "చక్రపాణి"

పుస్తకాలకు:—యువ కార్యాలయం, తెనాలి.

(నవశక్తి కార్యాలయంలో కూడా దొరుకు తాయి.)

# సోవియట్‌తో మిలటరీ సంధికి

## ఇంకా డిక్టేటర్లను తృప్తి

డిక్టేటర్ల బెదరింపులకు, బుభాయింపులకు ప్రజాస్వామ్య ప్రభుత్వాలు అడ్డు రాలేదు. చూడండి. ఇథోపియా: ముస్సోలినీపై నూనె ఆంక్ష ఇంగ్లండు విధించలేదు. విధించివుంటే ముస్సోలినీ ఆగిపోయేవాడు. ఆస్ట్రియా: బ్రిటన్‌గాని ఫ్రాంసుగాని హిట్లర్ దాడిని లక్ష్యపెట్టనే లేదు. జకొస్లోవేకియా: బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వాల సహాయంతోనే హిట్లర్ మ్రింగాడు. స్పెయిన్: బ్రిటిషు, ఫ్రెంచివారు సృష్టించిన "నాన్ ఇంటర్వెన్షన్", చేసిన ద్రోహం, ఫ్రాంకోకు సహాయపడింది. మెమెల్: జర్మన్ ప్రజలధిక సంఖ్యాకులు గలరని మ్యాప్లో తనకు రావాలని హిట్లర్ కాజేస్తే ఒక్క అసమ్మతి వాక్యం నోటినుండి పెగులలేదు. ఒక్కసారి పిస్టు తిరగెయ్యండి: హిట్లర్ కాలనీలను అడుగుతూనే ఉన్నాడు. ముస్సోలినీ జిబోతి, ట్యునీషియా అని కేకలు వేస్తూనే ఉన్నాడు. కాని హఠాత్తుగా ముస్సోలినీ అల్బేనియాను మ్రింగివేశాడు.

ఇంకేముంది: బ్రిటిషువారి పలుకుబడిగల ప్రదేశాలకే ఎసరు వచ్చింది: కోర్ఫూ—మాల్టా—ఈజిప్టు—సూయెజ్....అమ్మయ్యో ఇవి పోవడమే: డిక్టేటర్లను "అపీజ్" (సంతృప్తి పరచడం) చేస్తున్న ఛాంబర్లేను ఛత్రం ఒక్కసారి "ప్రజాస్వామ్యం: ప్రజాస్వామ్యరక్షణ ::" అంటూ ఎగిరింది. నిజంగా పోలండు ప్రజాస్వామ్యదేశమేనా: .... ఆలోచించండి. ఆలోచించేముందు ఒక్కసారి రూజువెల్టు శాంతి సందేశం నాటినుండి నేటివరకు జరిగిన ఘటనలు విచారించండి:

### రూజువెల్టు సందేశం

1938 సెప్టెంబర్ 26, 27 వ తేదీలలో రూజువెల్టు, ప్రపంచ మహాసభ ఒకటి జరగాలని విజ్ఞప్తి చేశాడు. కాని బ్రిటన్ ఫ్రాంసులు హిట్లర్‌భయంవల్ల —హిట్లరును తృప్తిపరచాలని తలంపువల్ల — అలాంటిసభ అవసరం లేదన్నారు. 1939 ఏప్రిల్ 15 వ తేదీన రూజువెల్టు మరొక సందేశం పంపాడు. ముఖ్యంగా ఇటలీ, జర్మనీలను వ్రేలెత్తి చూపెట్టి, కొన్ని దేశాల పేర్కొని వాటికి 10 ఏండ్లయినా గ్యారంటీ ఈయమన్నాడు. వీరిద్దరినే వ్రేలెత్తి చూపడమే చాలు. ప్రపంచాభిప్రాయ మంతా యుద్ధానికి వీరే కారకులని బోధపడింది. రేడియోలద్వారా రూజువెల్టు సందేశంవిన్న జర్మన్ ప్రజలుకూడ అలా భావించితే భావించవచ్చు. రూజువెల్టు సందేశం హిట్లర్ ముస్సోలినీలకు—ఫేసిజానికి ఒక దెబ్బ అనాలి. అయితే రూజువెల్టు ఈ సందేశం ఎందుకీయాలి: ప్రజాస్వామ్య దేశాలని చెప్పుకొనే దేశాలన్నీ, వలసదేశాలను పీల్చి పిప్పిచేయుటలేదా: "సంతృప్తి" పడ్డ ఈ దేశాలు, "ఆకలిగొన్న" ఫేసిస్టు దేశాలకు నీతి బోధించవలసినంత భయమేమి కల్గింది: అన్నప్రశ్న రావచ్చు. స్టాలిన్ చెప్పినట్లు "ప్రపంచాన్ని మరొక ఆర్థికక్షోభ పట్టుకొన్నది. అది మొదట అమెరికాను, తర్వాత ఇంగ్లాండు ఫ్రాంసులను ఆవరించింది." ఒక అమెరికన్ విలేఖరి అమెరికా ప్రజాభిప్రాయాన్ని ఇలా వివరించాడు. "ప్రపంచమంతా ఒక క్లిష్ట పరిస్థితిలో తగుల్కొంది. ఈ గందరగోళం తప్పదు. ఏదైనా ఒక హఠాత్ ఘటన (మిరకిల్) ఏమన్నా యూరప్‌ను రక్షించాలి." నూతన ఆర్థిక క్షోభతో కృంగుతున్న అమెరికాకు మరొక సంగ్రామం క్లిష్టస్థితిని మరింత అధ్వాన్నం చేస్తుంది. అందుకే ఈ సందేశమీయవలసి వచ్చింది.

ఏప్రియల్ 28 వ తేదీన అమెరికాకు జవాబిచ్చాడు. జవాబిచ్చేముందు, రూజ్‌వెల్టు పేర్కొన కొన్ని దేశాలవారిని "మీకు మావల్ల భయముందా: రూజ్‌వెల్టును మీరలా అడగమన్నారా" అని ప్రశ్నించాడు. ఈ ప్రశ్నకు జవాబివ్వడం కష్టమే అయింది చిన్న దేశాలకు. ఇదివరకే హిట్లర్ పలుకుబడిలో ఉన్న దేశాలు ఎపుడు దిగమ్రింగుతాడో అన్న భయంవల్ల "లేదు. లేదు మీవల్ల మాకేమీభయంలేదు" అని జవాబిచ్చాయి హిట్లర్ దాడి అంటే భయపడుతూ, మిత్రమండలిపై ఆధారపడ్డ దేశాలకు జర్మనీవల్ల తాము భయపడ్డామని చెప్పుకోడం నామర్దా. అందువల్ల తమకేమీ భయం లేదని పైకి చెప్పవలసివచ్చింది.

### హిట్లర్ జవాబు

'పిలువని పేరంటానికి' నీ వెందుకు వచ్చావయ్యా అని రూజ్‌వెల్టును పరిహసించేందుకే హిట్లర్ ఈ ప్రశ్న వేశాడు.

హిట్లర్ ఉపన్యాసంలో తేలిన విషయాలేమిటి: పరిస్థితులు ఇదివర కెలా ఉన్నవో అలాగే ఉన్నాయి గాని మారలేదు. హిట్లర్ యుద్ధాన్ని ప్రకటించలేదు. శాంతికి అభయమూ ఇవ్వలేదు. ఒక ప్రక్క రూజ్‌వెల్టును పరిహసించాడు. అతడు కోరిన ప్రపంచ సమావేశాన్ని తిరస్కరించాడు. శాంతికి అభయాన్ని ఇవ్వడానికి నిరాకరించాడు. మరొకప్రక్క తన మిత్రుడైన ఛాంబర్లేనుతో సంప్రదించడానికి అంటే మరొక మ్యూనిక్ నాటకం ఆడటానికి తనకు ఇష్టమేనని తెలియజేశాడు. అయితే తన హక్కులను వదలుకోలేదు. కాలనీలను కోరాడు. ఇంకా కోరతా నన్నాడు. తనకు డాంజిగు కావాలని పోలండును బెదరించాడు. మరొకసారి స్పష్టంగా చెప్పాలంటే హిట్లర్ ఉపన్యాసం :

1. రూజ్‌వెల్టు సూచనలను తిరస్కరించడం.
2. బ్రిటన్‌తో సంధి సంప్రదింపులకు తావు.
3. కాలనీలు, డాంజిగ్, పోలిష్‌కారిడర్ గుండా ఒక రోడ్డు కావాలని కోరడం.
4. ఆంగ్లో-జర్మన్ నౌకాసంధి: పోలిష్-జర్మన్ నాన్ ఎగ్రెషన్ (ఒకరిపై దాడి సలుపకుండుట) సంధి: ఈ రెంటినీ రద్దుపరచి బెదరించడం.

ఈ విధంగా ఒకవైపు బెదరింపు, మరొకవైపు సమాలోచనలు హిట్లరుకు మామూలే.

### జర్మనీ-పోలండు

పోలండుతో చేసికొన్న సంధిని రద్దు కావించుతూ హిట్లర్ కోరినదేమిటి: అతని ఉపన్యాసమే చెబుతుంది.

"యూరప్ శాంతికోసం, ఊహింప దగ్గ గొప్ప కన్సెషన్ (బహుమతి) రీష్ క్రిందకు డాంజిగ్‌ను స్వతంత్ర పట్టణంగా తీసుకరావడం, కారిడర్ గుండా ఒకదారిని జర్మనీకి ఈయడం. జర్మనీ ఒక రైల్వేనికూడా కలిగి ఉంటుంది. పోలిష్ కారిడర్‌లో పోలండ్‌కు ఎలాంటి హక్కులను గలిగి యుంటుందో, అలాంటి హక్కులనే జర్మనీ ఈ మార్గంపైన కలిగియుండాలి.

దీనికి ఫలితంగా జర్మనీ-పోలండ్ చేయదలచినదేమిటి: హిట్లర్ అంటున్నాడు.

"డాంజిగ్‌లోని పోలండు ఆర్థిక హక్కులన్నీ గుర్తింపబడతాయి: డాంజిగ్‌లో తన ఇష్టంవచ్చినంత సైజులో సముద్రంలోకి స్వేచ్ఛగా పోడానికి వీలు గల్గిన హార్బర్‌ను కట్టుకోవచ్చు. ఇప్పటి జర్మన్—పోలిష సరిహద్దులను గుర్తించుతాను: 25 ఏండ్లవరకు 'నాన్‌ఎగ్రెషన్' సంధి (ఒకరిపైఒకరు ఆక్రమణ చేయకుండడం) జర్మనీ, పోలండ్, హంగేరీలు సంయుక్తంగా 'స్లొవేకియా' స్వాతంత్ర్యాన్ని కాపాడటం."

ఈ సూచనల గురించి విమర్శించేముందు పోలండు జర్మనీ పూర్వసంబంధాలను చూద్దాం. ప్రపంచ యుద్ధానంతరం, జర్మనీవారి సైలీషియాలోని బొగ్గుగనుల ప్రదేశాలు పోలండ్‌కు పోయాయి. ఇంతేగాక ఈస్టు ప్రష్యాను జర్మనీ నుండి విడదీసి పోలిష్ కారిడర్‌ను (పొమొర్జీ రాష్ట్రం) సృష్టించారు. డాంజిగ్, పోలండు ఆర్థిక పెత్తనంక్రిందకు వచ్చింది. అప్పటి నుండి, జర్మనీ పోలండులకు ద్వేషభావమే ఉన్నది. కాని పోలండు ఉనికి ననుసరించి, అది రష్యా, జర్మనీలమధ్య ఊగులాడుతున్నది. కర్నల్‌బెక్ విదేశాంగ నీతి మొన్న మొన్నటివరకు రష్యా బోల్షివిజంకన్న, జర్మన్ నాజిజం మంచిదనేరకంలో ఉన్నారు. కాని పూర్తిగా జర్మనీకి లొంగకుండా బ్రిటన్ అడ్డుపడుతూ వచ్చింది.

నేటి పోలండ్ వైశాల్యం 150,000 చదరపుమైళ్ళు. జనాభా 34,000,000. 1932 లో జర్మనీతో పదేండ్ల సంధిచేసికొంది మరొకప్రక్క సోవియట్ యూనియన్‌తో 1932 లోనే నాన్‌ఎగ్రెషన్ పాక్టు చేసికొంది. ఇంతేగాక పొరుగున నున్నవారిని తటస్థంగా ఉండేటట్లు చేయడానికి కొన్నిసంధులు చేసికుంది. అవి జర్మనీకి విరుద్ధంగా ఫ్రాంసుతోను, సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా రుమేనియాతోను సంధులుచేసికొంది. కాని జెకొస్లోవేకియా ఆక్రమణ వరకు జర్మనీతో సహకారం చూపడం వల్ల, ఫ్రాంసుతో సంధికి అప్పే విలువలేకపోయింది.

#### పోలండ్ సమాధానం

హిట్లర్ గావించిన సూచనల అంతరార్థం ఏమిటి: అతడు కలలు గంటున్న 'పెద్ద యుక్రైన్' నిర్మాణానికే. హిట్లర్ సూచనలు పోలండు అంగీకరిస్తే, అది మరొక జకొస్లోవేకియా అవుతుంది. ఇదివరకు పోలిష్—జర్మనీ సంధి 10 ఏండ్లవరకని. కాని అపుడే రద్దయింది. ఆంగ్లో జర్మన్ నౌకాసంధికికూడ ఇదే గతి పట్టింది. జకొస్లోవేకియాలో 'జర్మనీల రక్షణార్థం' ఇచ్చిన వాగ్దానాన్ని భంగపరచి బొహెమియా, మొరేవియాలను మ్రింగాడు. ఇక ముస్సోలినీ వాగ్దానం చూడండి. ఏప్రిల్ 5 తేదీన అల్బేనియా ఆక్రమింప బడదని ఛాంబర్లేనుకు చెప్పాడు. రెండురోజులు గడిచిందో లేదో 20 వేల ఇటాలియన్ సైన్యాలు, అల్బేనియాను దిగ మ్రింగాయి.

కాబట్టి ఈ 25 ఏండ్ల వాగ్దానానికి కూడా ఫలితం అదే అవుతుంది. పోలిష్ కారిడర్ గుండా రోడ్డు ఇస్తే ఏమవుతుంది: ఆ రోడ్డు ఊరక ఈస్ట్ ప్రష్యాతో కలపడానికి పనికిరావడమే గాదు. దానిచుట్టూ కోటలు గడతారు. బాల్టిక్ సముద్రం నుండి, లెనిన్‌గ్రాడ్ (రష్యా) కు మిలటరీ సైన్యాలు పోవడానికి తోడ్పడుతుంది.

పోలిష్ విదేశాంగమంత్రి కర్నల్ బెక్ ఇచ్చిన జవాబులో 25 ఏండ్ల సంధిమాట ఎత్తాడు. ఈ విషయం ఇదివరకు తనకు తెలియనే తెలియదన్నాడు. డాంజిగ్ విషయం ఎత్తుతూ "డాంజిగ్ ప్రజలలో అధికసంఖ్యాకులు జర్మనులే. కాని దాని జీవితము, సంపద పోలండ్‌మీదే ఆధారపడి ఉంటుంది. సముద్ర వర్తకంమీద మా హక్కులను దృఢంగా నిలబెట్టుకుంటాం....కారిడర్ విషయంలోనూ మా అధికారాన్ని తగ్గించుకోవలసిన అవసరంలేదు" పత్రికలన్నీ ఈ ఉపన్యాసాన్ని "దృఢ"మైనది అంటున్నాయి, కాని మాకు నమ్మకం లేదు. ఇంతకంటే దృఢంగా షూషినిగ్ మాట్లాడాడు. ఇంతకంటె దృఢంగా బీనెస్ మాట్లాడాడు. ఇపుడు బెక్ మాట్లాడుతున్నాడు. కాని పోలండ్ స్వాతంత్ర్యం నిలబడుతుందా:






# ఛాంబర్లేను తయారు కావడంలేదు

## పరచడానికే చూస్తున్నాడు

మెమెల్ ఆక్రమణ, రుమేనియాతో జర్మనీ వర్తకసంధి, ముస్సోలినీ అల్బేనియా ఆక్రమణ ఇంగ్లండు ఫ్రాంసులలోను, ఇతర ప్రపంచంలోనూ ప్రజాభిప్రాయం ఫాసిస్టులను అరికట్టాలని ఒత్తిడి తెచ్చింది. ఛాంబర్లేను, బోనెట్ కూటానికి ఇష్టం లేకపోయినా ఫేసిస్టులను అరికట్టదలచే ప్రయత్నం చేస్తున్నట్లు నటించవలసింది. అందుకోసం పోలండ్, రుమేనియా, గ్రీసులకు సహాయ వాగ్దానం (మిలిటరీ సంధి కాదు) ఇంగ్లండులో శాంతి సమయంలోనే



రూజువెల్టు

కన్‌స్క్రిప్షన్ (నిర్బంధ సైనికశిక్షణ) ఛాంబర్లేను చేశాడు. దానితో లేబర్‌పార్టీ కొంత అసమ్మతి చూపినా, ఇదివరకు వ్యతిరేకించుతున్న చర్చిల్-ఈడెన్-డఫ్‌కూపర్ ముఠా సంతసించింది వారిని మంత్రివర్గంలో వేసుకోపోయినా ప్రజలు ఛాంబర్లేను నిజంగా ఫేసిస్టులదాడిని ఎదుర్కొంటానికి ప్రయత్నించుతున్నా డనుకొనేటట్లు ఛాంబర్లేను నటించాడు. కాని నిజంగా ఫేసిస్టులదాడిని ఛాంబర్లేను ఆపుతాడా: అసడు, అతని దృష్టి ఎంత సేపటకీ హిట్లర్‌ను రష్యావైపుకు మరలించడమే. ఇందుకు కావలసినన్ని ఉదాహరణలున్నాయి.

### బ్రిటిషు కుట్ర

మార్చి 31 వ తేదీన పోలండ్‌కు అభయమిస్తూ ఛాంబర్లేను ఉపన్యసించాడు. దానిపై ఛాంబర్లేను ముఠా అంతర్వాణి అనదగిన టైమ్సు పత్రిక ఇలావ్రాసింది.

"ఈప్రకటన, న్యాయమగు స్వచ్ఛమైన సంప్రదింపులకు బ్రిటను నిలచియున్నదని తెలియజేస్తుంది. ఈ నూతన వాగ్దానం పోలండ్ సరిహద్దులయొక్క ప్రతి అంగుళపు భూమినీ రక్షించాలనిలేదు. ప్రధానమగు శబ్దము ఇంటెగ్రిటీ (యావత్ స్వాతంత్ర్యం) కాదు, ఇండిపెండెన్సు (స్వాతంత్ర్యం.)"

ఈ రెండిటిభేదం సుస్పష్టమే. స్వాతంత్ర్యం నిలుస్తుంది. కాని, ఇంటెగ్రిటీ నిలవదు. ఆ స్వాతంత్ర్యం నేడు జకోస్లోవేకియాకు ఉన్నలాంటిదే:

రుమేనియా, పోలండ్, గ్రీస్‌లకు ఇచ్చిన బ్రిటన్ వాగ్దానంలో, విలువ యేమిటి: దానిని ఎవరో "ఫీబిల్‌బ్లాక్" (బలహీనమైన బ్లాకు) అన్నారు. రుమేనియాకు హిట్లర్‌కూడా స్వాతంత్ర్యం కాపాడతానని చెప్పలేదూ: ఇదీఅంతే.

ఫేసిస్టుల దారిని అరికట్టడానికి రష్యా గావించిన సూచనలు బ్రిటన్ అంగీకరించడం లేదు. ఫ్రాంసు, బ్రిటన్ రష్యాలు మిలటరీ సంధి గావించుకొని, దాడి నరికట్టుదామని రష్యా వాదన. కాని బ్రిటన్ పోలెండు రుమేనియాలు దాని కంగీకరించరని, ఆదేశాలతో అనిపించింది. టైమ్సు పత్రిక (ఛాంబర్లేను ముఠా పత్రిక) ఏమివ్రాసిందో గమనించండి:

"సోవియట్ సైన్యాలు ఈదేశాలను రక్షించడానికి వస్తే, వాటిని మళ్ళా వెనిక్కిపంపడం కష్టం. ఒకవేళ పోయినా, 'కమ్యూనిజం' ఆ దేశంలలో విడిచిపెట్టి పోతాయి." ఈవాదన ఎంత పరిహాసాస్పదమో మనకు తెలుసు మరొకద్రోహం చేయడానికే, అన్యదేశాక్రమణ నీతిలేని రష్యాపై ఈ నిందల మోపడానికి కారణమైంది.

దేశాన్ని ఎంతో యుద్ధానికి తయారు చేస్తున్నట్లు నటించినా, ఛాంబర్లేను అంతర్యమేమిటో హిట్లరుకు తెలుసు. అందుకనే, ఏప్రిల్ 28 వ తేదీ ఉపన్యాసంలో ఇలా అన్నాడు.

"నా రాజకీయ జీవితంలో ఎపుడూ, బ్రిటన్ జర్మనీ దగ్గఱ స్నేహసంబంధా లుండాలనే అభిప్రాయాన్ని వెల్లడించాను." ఇంతేగాదు. "బ్రిటిషు సామ్రాజ్య అస్తిత్వం, యావత్ మానవ వైజ్ఞానిక, ఆర్థిక జీవితానికి అవసరం." అని పొగిడాడు. ఇంతాపొగిడి ఆంగ్లో—జర్మన్ నౌకాసంధిని రద్దుచేసుకోడం ఆత్మ గౌరవానికని చెప్పాడు. తర్వాత "బ్రిటన్ జర్మనీతో సంప్రదింపులు జరిపితే నాకంటె సంతోషించేవాడెవడూ ఉండడు," అని అన్నాడు.

దీనికి సమాధానంగా లండన్ టైమ్సు పత్రిక వ్రాసినవాక్యాలు మరచిపోరాదు. "జర్మనీ నిజముగా సహకారం కోరితే సగంకంటె ఎక్కువదూరం రావడానికి బ్రిటన్ సంసిద్ధత చూపుతుంది. ఇదే కాలనీల విషయంలోకూడా."

కాబట్టి ఈ మధ్య ఎంత ఫేసిస్టు ప్రతికూల ప్రజాభిప్రాయంఏర్పడ్డా ఇంకా ఛాంబర్లేను అపీజ్‌మెంటు (సంతృప్తిపఱచే)విధానం పోలేదని తెలుస్తోంది. కర్నల్‌బెక్ గత రాజకీయ జీవితం అంతా జర్మనీతో స్నేహాన్ని కోరేదే. ఇపుడు "దృఢ నిశ్చయం"తో చెప్పారని చెప్పిన అతని ఉపన్యాసంలోకూడ ఈ క్రింది మాటలు గమనింప దగ్గవి.

"నిజంగా శాంతికి అర్థమనేది ఉంటే రెండు విషయాలు అవసరం. మొదటిది శాంతిని కోరే ఉద్దేశ్యం, రెండవది శాంతియుత ఆచరణ: ఈ రెండు సిద్ధాంతాలు రీష్ గమనిస్తే నేను సూచించిన విషయాలను గురించి సంభాషించుటకు అభ్యంతరము లేదు. అలాంటి సంభాషణలు లాభం కలుగజేస్తే, పోలెండు తన సహకార భావాన్ని త్యజించదు."

ఈస్టుప్రష్యా నుండి వెస్టు ప్రష్యాకు మార్గాలకు గల జర్మను హక్కులను పోలండు కాదనడం లేదు. రోడ్డు నిర్మించుకొనేందుకు, రైల్వే నిర్మాణానికి ఒప్పుకుంటున్నది. పోతే భూమి ఈయనంటున్నది.

### రష్యా-బ్రిటన్ సంప్రదింపులు

కాబట్టి మరొక మ్యూనిక్ నాటకం జరిగే అవకాశాలు ఇంకా నశించలేదు. ప్రజాభిప్రాయానికి లొంగి రష్యాతో సంప్రదింపులు ప్రారంభించారేగాని హృదయపూర్వకంగా గాదు. ఫాసిస్టు దాడి నరికట్టడానికి రష్యాగావించే సూచనలివి.

1. ఫ్రాంసు, బ్రిటన్, సోవియట్ యూనియనులమధ్య మిలిటరీ బ్లాకు ఏర్పడాలి.
2. బ్రిటన్ ఫ్రాంసులు, పోలండు, రుమేనియాల కిచ్చిన అభయములో సోవియట్ చేరుతుంది.
3. పైన చెప్పిన దేశాలుగాని, పోలండు, బెల్జియం, స్విట్జర్లండ్‌లు గాని దాడికి గురియైతే సోవియట్ సహాయం చేస్తుంది.
4. బ్రిటన్, ఫ్రాంసులు, లిట్వియా, లిథూనియా, ఇస్తోనియాలకు గ్యారంటీ ఈయాలి (ఈ మూడు దేశాలగుండా రష్యాపై జర్మనీ పడటానికి వీలుంది)

కాని, కామన్సు సభలో 'బాల్టిక్' రాజ్యాలను అంటే లిథూనియా, లిట్వియా, ఇస్తోనియాలను పరస్పర సహాయ సంధిలోగాని, గ్యారంటీలోగాని చేర్చడం లేదని బట్లర్ మహాశయుడు చెప్పాడు.

ఆంగ్లో సోవియట్ సంభాషణలు క్లిష్టదశకు వచ్చాయనికూడా అపుడే వార్తలు. కాబట్టి ఛాంబర్లేను సోవియట్‌తో సంధిని గావించే ప్రయత్నాలకు ద్రోహం చేస్తున్నాడన్నమాట! దానికి ఉదాహరణమే మళ్ళీ జర్మన్ రాయబారిని తిరిగి పంపించడం.

### జర్మనీ క్రొత్త ఎత్తులు

ఒకప్రక్క ఆంగ్లో—రష్యన్ సంభాషణలు జరుగుతూనే ఉన్నాయి. ఇటలీ, జర్మనీలు రాజకీయ మిలిటరీ ఒడంబడిక గావించుకొన్నాయి. ఇది అందరికి ఆశ్చర్యాన్ని కల్గించింది. ఇటలీ మధ్యధరా సముద్రంలోను, జర్మనీ బాల్టిక్, మధ్య యూరప్‌లో తమ జైత్రయాత్ర సాగించడానికే ఈ సంధి అనవచ్చు. ఈసంధివల్ల మళ్ళా ప్రజాభిప్రాయం, ఛాంబర్లేనుపై ఒత్తిడి తేవచ్చు. దాన్నికూడా నిర్లక్ష్యపఱచి, హిట్లరును సంతృప్తిపఱచదలచాడా భవిష్యత్తు మన మెరిగినదే. అది రష్యాపైదాడి.

జర్మనీ, డెన్మార్క్, స్వీడెన్, నార్వేలను తటస్థంగా ఉంచడానికి ప్రయత్నించుతున్నది. బాల్టిక్ రాజ్యాలతోగూడ అలాంటి ప్రయత్నమే చేస్తున్నది.

ఛాంబర్లేనుకు ఏమాత్రం అవకాశమిచ్చినా, హంగేరీ, బల్గేరియాల సహాయంతోను, క్రొత్తగా ఆల్బేనియా ఆక్రమణవల్ల భయపడుతున్న యుగోస్లేవియాతోను ఒత్తిడితెచ్చి, రుమేనియాను తనక్రిందకు జర్మనీ లాక్కొంటుంది: డాన్జిగ్‌ను పోలిష్‌కారిడర్లను కాజేసి పోలెండ్‌ను తటస్థపఱచడానికి ప్రయత్నిస్తుంది. ఈ రెండూ సఫలమయితే, తరువాత ఫ్రాంసు, స్విజర్లండుల వంతు .... యుక్రైన్ వంతు....

### బ్రిటన్ పాత్ర

కాని బ్రిటన్ ఏమి చేస్తుంది: జర్మనీ ఇటలీల ఒడంబడిక వలన ప్రజాభి ప్రాయానికి లొంగవచ్చు. లొంగినా రష్యాతో మిలటరీ ఒడంబడిక చేసికోదు. ఏదో విమాన బలమో, లేక సాధారణమైన సహాయసంధితోనే సంతృప్తిపడుతుంది. బ్రిటన్ రష్యాను సాధ్యమైనంత లోపలికి లాగాలని చూస్తున్నది. అందుకనే డెన్మార్కు, స్వీడన్, నార్వే మొదలగు వాటి రక్షణకుకూడ తయారని సోవియట్



ఛేంబర్లేన్

(లిట్వినాఫ్) చేత అనిపించింది. కాని తాను మాత్రం బాల్టిక్ దేశాల రక్షణకు తయారుగానడం లేదు.

లిట్వినాఫ్ రాజీనామాకు కారణం తెలియదు. కాని అతని రాజీనామాయే సంప్రదింపులకేమీ భగ్నంతేదు. తెచ్చేదల్లా బ్రిటన్ నీతియే.

ఇటు ఒకప్రక్క సంప్రదింపులు గావించుతూ కన్‌స్క్రిప్షన్ గావించింది బ్రిటన్. యుద్ధపు బడ్జెటు, 630 మిలియన్ల (మిలియన్ 10 లక్షలు) పౌనులకు పెంచింది. వలసదేశాలలో కట్టుదిట్టాలు గావించింది. ఇండియా ఆక్టును సవరించి, మరింత సంకుచితపఱచింది. ఇదంతా వలసదేశాల స్వాతంత్ర్యోద్యమాన్ని, దేశంలో కార్మికోద్యమాన్ని తీవ్రంగా అణచడానికే.

ఆంగ్లో-రష్యా సంప్రదింపులు భగ్నమయి, కారిడర్, డాంజిగ్‌లు జర్మనీ కర్పింపబడినా ఆశ్చర్యం లేదు. ఇది తాత్కాలికంగా యుద్ధాన్ని ఆపవచ్చు. కాని ప్రపంచాన్ని మళ్ళా విభజించాలని సాగుతున్న యుద్ధంగా మారడాన్ని ఆపలేదు. దానిని ఆపే మార్గం రష్యా సూచించిన మిలటరీ ఒడంబడిక గావించడం: కాని ఛాంబర్లేను ఉన్నన్నాళ్లు ఇది కొనసాగడం....

# గంగాపూరు సంస్థానంలో కాల్పులు

## 65 మంది మరణించారు, 40 మంది గాయపడ్డారు.

గంగాపూర్ సంస్థానం, ఒరిస్సా సంస్థానాలలో ఒకటి. ఒరిస్సా రాష్ట్రంలోని సంబాల్‌పూర్ జిల్లాని అంటి వుంది. దీని వైశాల్యం 2,492 చదరపు మైళ్ళు. జనాభా సుమారు 3½ లక్షలు. ఈ సంస్థాన ప్రభుత్వానికి సాలీనా 6 లక్షల 39 వేల రూపాయిలు ఆదాయం వస్తుంది. ఇందులోంచి బ్రిటిషు ప్రభుత్వానికి సాలీన యీసంస్థానం కట్టే కప్పం పదివేల రూపాయిలు మాత్రమే. ఈ సంస్థానం ఖనిజాలకి, చాలా ప్రసిద్ధి. అరణ్యాలు ఎక్కువ.

ఈ సంస్థాధీశుడు గతసంవత్సరమే ఇంగ్లండులో మరణించాడు. మరణించే సరికి ఇంకా అతను సింహాసనమే ఎక్కలేదు. అతనితరఫున బ్రిటిష్ ప్రభుత్వమే యీ వ్యవహారం అంతా చూస్తూఉంది. సంస్థానాధీశుని మరణానంతరం మహారాణీ వ్యవహారాలను చూస్తూ ఉంది. ఈ సంవత్సరం శిస్తు వసూళ్ళ సందర్భములో వాటిభారము ఎక్కువగా వున్నదని ప్రజలు ప్రభుత్వానికి మొరలుపెట్టు కొన్నారు. ఫిబ్రవరి 9 వ తేదీని సర్గిపల్లి అనుచోట రాణీ ఒకసభ పెట్టింది సుమారు 4 లేక 5 వేలమంది ప్రజలు ఆ సభకు హాజరయి యీ దిగువ కోరికలుగల విన్నపత్రాన్ని సమర్పించారు.

### ప్రజల కోర్కెలు.

1. భూమిస్తులు 1910 వ సంవత్సరం రేట్లు ప్రకారం ఏర్పాటు చేయాలి. 2. ఆ సెటిల్మెంటులో అడవులపై ప్రజలకుగల హక్కులు తిరిగి ఏర్పాటు గావాలి (3) గడిప 1కి 12 శేర్ల బియ్యం 3 అణాలు చొప్పున వసూలు చేయుటచే చౌకీదారుపన్ను తప్పించాలి. (4) ఎవరి పశువుల చర్మమును వారు ఉపయోగించుకొనుటకు అధికారం కావాలి. (ఇదివరలో మునాపలీస్టుకే చెందేది )(5) ప్రజలకు ఓటింగు అధికారం గల బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటుకావాలి. (6) నిర్బంధ సేవ (బేత్) పూర్తిగా రద్దు చేయాలి. (7) ప్రజలచే నిర్ణయింపబడ్డ రోడ్లపై ఎడ్లబండ్లుతోలుకొనుటకుహక్కుకావాలి (8) సాగు సౌకర్యాలకై ప్రతిచోటా చెరువులు త్రవ్వించి గట్లుకట్టు దిట్టంచేయాలి. (9) పంటలు పాడుచేసే అడవి మృగాలను కాల్చుటకు అధికారం ఇవ్వాలి (10) లక్క, కోకూన్‌లు, మొదలగు వాటిని సంస్థానంలో తమ కిష్టమైన వర్తకునికి అమ్ముకొనేటందుకు రైతులకు హక్కుఉండాలి. అవర్తకుడు సంస్థానం వెలుపలకు ఎగుమతి చేసినచో దానిపై ఎగుమతిపన్ను వేయవచ్చును. (11) కో ఆపరేటివు పరపతి సంఘాలు ఏర్పాటు చేయాలి.(12)సంస్థానములో కాళీవచ్చిన ఉద్యోగాలను, వెలుపలినుండి ఉద్యోగులనురప్పించి, భర్తీచేయక,సంస్థానంలో ఉన్న వారికే అవకాశంచూపాలి.యీదరఖాస్తుకు మహారాణి ప్రభుత్వంనుండి ఏ సమాధానమూ రాలేదు.

### పిస్తోలుచూపియే పన్ను వసూళ్లు

సంస్థానంలో పన్నులు వరస చాలాచిత్రం. ఇదివరలో యక 1కి 1—9—0; బ్రిటిషు ఒరిస్సా ప్రాంతాలలో 1—2—0 పన్ను రేటుఉంటే యిక్కడ యిప్పుడు యక 1కి 2—8—0 విధింపబడింది. ఈమార్పు చేసేటప్పుడు అభ్యంతరాలు చెప్పడానికి ప్రజలకేమీ అవకాశ మివ్వనేలేదు. దీనిని వసూలుచేసేపద్ధతి మరీ విచిత్రం మిలిటరీని కూడా తీసుకొనివెళ్ళి, పన్నుకై నిర్బధించడం. వెంటనే ఆస్తి జప్తుచేయడం. కాదంటే— స్త్రీ పరిపాలనచేసే సంస్థానంలోకూడా ఇదే వైఖరి. ఇంక ఇతరసంస్థానాలసంగతి చెప్పాలా, అసలు ఆ విధానం దానిని పోషించి బలపరచే బ్రిటిష్ సామ్రాజ్యవాదంలోనే ఉంది దీనికి కీలకమంతా.

ఈ సంస్థానంలో పన్నులు వసూలుచేయ డానికి ఇదివరలో కొన్ని మిలిటరీ దళాలను బ్రిటిషు ప్రభుత్వం పంపింది. గతనెల ఆఖరి వారంతో మరిఒకదళాన్ని పంపింది. దీనికి చూపిన కారణం ప్రభుత్వాధికారులు అరెస్టులు చేస్తూంటే ప్రజలు అటకాయించు తున్నారని. యీవర్తమానం తెలియగానే సారంగధరదాస్ (ఒరిస్సా సంస్థాన ప్రజల కార్యదర్శి) గారు, అట్టి ఆటంకాలను ప్రజలు కలిగింపకుండా చేయవలసిందని కొందరు మిత్రులకు తంతులు పంపాడు. ఇక్కడ అసలు ఇంకా ప్రజామండలి ఏర్పాటు కాలేదు.

ఇంక ఆప్రజలకు సలహాలిచ్చి పోరాటంలో వారిని నడిపేదెవరు? సంస్థానాధికారులు అదే పనిగా ప్రజలను రెచ్చగొట్టుతూంటే నాయకత్వం లేని ప్రజలేమి చేయగలరు?

గంగాపూర్ రైజాగుతా లలోని ప్రజలు పన్నులు తగ్గించేవరకూ పన్ను యివ్వమని నిరాకరించారు. వారిలో ఇద్దరిని అరెస్టుచేశారు. పాతవి, కొత్తవి, అన్నీ నిర్బధించి వసూలు చేస్తున్నారు అధికారులు.

ప్రజలు ప్రతిఘటించారు. 29 తేదీని గంగాపూర్‌లో ప్రజలపై మిలిటరీ తుపాకులు పేల్చింది. 65 మంది మరణించారు. మరి 40 మంది గాయపడ్డారు.

ఇట్టి విషాదగాధ ఒరిస్సా సంసాన ప్రజలకు కొత్తగాదు. ఢెంకానల్, రాంపూర్, టాల్చేర్ మొదలగు ప్రాంతాలలో సంస్థానాధిపతుల క్రౌర్యము భారతీయులందరికి విశదమే. దీన్ని ఆపవలసిన కర్తవ్యం కాంగ్రెస్‌దే.

## రాజకోటకు మహాత్ముని ప్రయాణం

మహాత్ముడు రాజకోటను వదలి వెళ్లిపోయిన పిదప రాజకోటలో సంస్కరణల కమిటీని ఎర్పాటు చేయుటకుబదులు దర్బార్ వీరవల్లాగారే ఒక రాజ్యాంగ విధానాన్ని సూచించారు. అందు ఆరోగ్యం, పారిశుధ్యం, విద్య, మ్యునిసిపల్ వ్యవహారాలు, ప్రజల అధీనంలోకి మార్చడానికి. అంగీకరింపబడింది.

ప్రజాపరిషత్ నాయకులు ప్రజాభిప్రాయాన్ని కనుక్కోకుండా ఏ నిర్ణయానికి రాలేమన్నారు. గాంధీజీతో మాట్లాడకుండా ఏమీచెప్పమన్నారు.

"రాజకోట వ్యవహారాన్ని తొందరలో పరిష్కారం చేయబోతున్నాము అని ఠాకూర్ సాహెబ్, దర్బార్ వీరవల్లాగార్లు గాంధీజీకి టెలిగ్రాం ఇచ్చారు. వల్లభాయి ఇందులో కలుగజేసుకొని ఆలస్యం చేయకుండా చూడవలసిందని దర్బార్ వీరవల్లాగాంధీజీని కోరాడు. "పైవారి అవసరం లేకుండా నీ ప్రజలతో నీవు రాజీపడతానంటే - నా కింకేమికావాలి? అని గాంధీజీ ఠాకూర్ సాహెబ్‌కు తిరిగితంతి పంపాడు.

'వల్లభాయికిగాని, నాకుగాని,అనవసరముగా కలుగజేసుకొని ఆలస్యం చేసి, సంధిపొసగకుండ చేయాలనిలేదు. నీమాటమీద నీవు నిలబడి గౌరవప్రదమైన సమాధానము కుదుర్చు. అంతే నాకు కావలసింది. 12 వ తేదీలోగా ఈశుభవర్తమానము నాకు రాకపోతే 12 వ తేదీకి తిరిగి రాజకోటవస్తాను" అని వీరవల్లాకు గాంధీజీ తంతి నిచ్చాడు.

వీరవల్లాగారు సూచించిన సంస్కరణల విషయమై ప్రజాపరిషత్తు దూరముగా తప్పుకుంది. మితవాదుల అభిమానాన్నైనా ఈలోగా సంపాదించుదామని ప్రభుత్వము ప్రయత్నించింది. కాని ప్రజాప్రతినిధులతోకూడిన శాసనసభయొక్క అధికారాలను గురించి పేచీ వచ్చింది. బడ్జెట్టుపై ఓటుచేయుటకు లోను, దానిని ప్యాసుచేయడములోను అధికారము, ప్రభుత్వ ఉద్యోగుల చర్యలను గురించి చర్చించడం మొదలగు అధికారాలు శాసనసభకు ఉండాలన్నారు మితవాదులు కూడ. ప్రభుత్వం వీటిని నిరాకరించింది. ఈ మితవాదులలోకూడ కొందరు ఇచ్చినది వదలవద్దంటున్నారు. కావలసిన దానికై పేచీ పెట్టమంటున్నారు మరికొందరు.

గాంధీజీ యీమితవాదులకు ఒకే తంతిపంపాడు "నేనుగాని వల్లభాయిగాని కలుగజేసుకోకుండా సమాధానము మీరు కుదుర్చ గలిగితే సంతోషమే. ప్రజాపరిషత్తునుకూడా మీతో కలుపుకుని నిర్ణయించుకుంటె మంచిది. వీలైనంతవరకు తగ్గవలసినదని, ఢేబార్‌కు కూడా తంతినిచ్చాను" అన్నాడు. ఢేబార్‌భాయి, తానెంతవరకు తగ్గగలడో విస్పష్టంగా ప్రకటించాడు. "వ్యవసాయము ఓక్ట్రోయి, కస్టమ్సు, ఎక్సైజ్ మొదలగు వాటిపన్నుద్వారా వచ్చే ఆదాయము కూడా శాసనసభ స్వాధీనము చేస్తానంటేనే మేము అంగీకరిస్తాము ఇంతకు ఏమీతగ్గలేము" అన్నాడు.

రాజకోట సోషలిస్టులు కామ్రేడ్స్ శుక్లా, హిరానీ, వాధ్వా, మెహతాగార్లు. ఈబేరం విధానాన్నే ప్రతిఘటించి గ్వ్యయర్ తీర్పు ప్రకారం ఏర్పడ్డ కమిటీచే నిర్ణయంచబడిన బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడి తీరాలని అంతకు తక్కువ మాత్రమూ తాముగాని రాజకోట ప్రజలుగా ఆమోదించరని, అంతవరకు పోరాడతారని' ప్రకటన చేశారు.

### రాజకోటలో తిరిగి నిర్బంధ విధానము

గత ఉద్యమములో పాల్గొన్న 8 మంది రైతుల భూములు ప్రభుత్వం లాక్కొన్నది. మహమ్మదీయులకు భయాలిట్‌లకు తాను గావించిన సూచనను గ్వ్యయర్ ఎదుట పెట్టడానికి ఏమీ అభ్యంతరం లేదన్నాడు గాంధీజీ. యీ వ్యవహారం అంతా తేల్చుకోడానికి గాంధీజీ 12 వ తేదీకి తిరిగి రాటకోటలో ప్రవేశించుటకు నిశ్చయించు కున్నాడు.

## ఈ ముగ్గురుని భరించడం ఎలా ?

పాలస్టయిన్ ఒంటె, యూదులను, అరబ్బులను, బ్రిటిషువారిని భరించగలదా ?









# నవశక్తి

## పార్టీ సభ్యులు ముఖ్యంగా గమనించాలి

| | మే నెల కోటా | ఏప్రిల్ నెలలో చేర్పించినది. |
|---|---|---|
| విశాఖపట్టణం | 10 | 0 |
| తూ. గోదావరి | 30 | 5 |
| ప. గోదావరి | 30 | 5 |
| కృష్ణా జిల్లా | 50 | 18 |
| గుంటూరు | 30 | 10 |
| నెల్లూరు | 25 | 8 |
| రాయలసీమ | 10 | 5 |
| చిత్తూరు | 5 | 3 |
| కర్నూలు | 5 | 0 |
| ఇతర స్థలాలు | 15 | 4 |
| | 200 | 58 |

* * *

ఈనెలలో 58 చందాదార్లనే చేర్పించారు. పార్టీసభ్యులు తమ విధిని నిర్వర్తించడం లేదు. పత్రిక పరిస్థితులందరు సభ్యులు ఎరిగినదే. పార్టీసభ్యులు తమ విధిని నిర్వర్తిస్తేనే, పత్రికను మరింత అభివృద్ధి చేయగలం. ఇది గమనించ కోరతాం. — సంపాదక వర్గం.

* *

## చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్ధ సంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

**బర్మా రేట్లు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు 5—0—0 |
| విడి ప్రతి | 0—1—6 |

* * *

## ప్రకటన రేట్లు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు)

| | | |
|---|---|---|
| 20 అం॥ లోపల ప్రతి అంగుళానికి | రూ. | 0—6—0 |
| 20" అం॥ పైన | ,, | 0—4—0 |
| 100" అం॥ పైన | ,, | 0—3—0 |
| పేజీ | రు 10—0—0 లు | |
| ½ పేజీ | 6—0—0 లు | |
| ¼ పేజీ | 3—0—0 లు | |

షరా:—ఈ రేట్లుపైన కమిషన్లు. డిస్కౌంటులు ఇవ్వబడవు. రు 0—8—0 లకు తక్కువ ప్రకటనలు తీసుకొనబడవు. నెలకగు డబ్బు ముందుగా ఇవ్వవలెను.

ప్రత్యేక చోటునకు, ప్రత్యేక రేట్లు.

Published by M. Chandrasekhara Rao
Printed by Tummala Venkata Ramiah } at Navasakti Press, Governorpet, Bezwada.

